


ఓరుగల్లు కోట రాతిగోడలపైన గల పోతనామాత్యుని చిత్రం.

—ప్రతిరూపం చిత్రించినవారు శ్రీ సోమేశ్వరరావుగారు

# రాబోవు జెమినీ చిత్రము

# ముగ్గురు కొడుకులు

అయితే, ముగ్గురి జీవితాలు, ప్రవర్తనాలు
మువ్వాడు విధాలు
మాతృప్రేమయొక్క మధుర తంతులను
స్పందింపజేస్తున్నవి

## త్వరలో వచ్చుచున్నది

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder: K. NAGESWARA RAO**

సంపుటము **44**
సంచిక **27**
**12-3-52**

ఖర సంవత్సర ఫాల్గున బహుళ పాడ్యమి బుధవారము


## విషయానుక్రమణిక

**1952 మార్చి 12**


**ముఖచిత్రం:** సూర్యప్రభ

వ్యాఖ్యలు: విమర్శలు — 2

**కథానికలు:**

అదృష్టహీనులు—'వనశ్రీ' — 6
తారుమారు—శ్రీ ధరణికోట శ్రీనివాసులు — 8
పండంటి సంసారం పైనపడితే—శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు — 12
వ్యథిత హృదయం—శ్రీ వంగల వేణుగోపాలాచార్య — 13
దరిద్రం—శ్రీపన్యాలరంగనాథరావు — 14
వారం-వర్జ్యం—"శ్రీరాగి" — 17
శ్రోత్రీమాస్టారు—జారు — 18

**సినిమా:** — 41

**బొమ్మరిల్లు:**

హకల్ బెరీ ఫిన్ (సీరియల్)—మార్క్ ట్వేన్ — 25
యుక్తిలెక్క—జి శ్రీదేవి — 30
అలవాటులో పొరపాటు—శ్రీమతి లంక అమృతాంబ — 32
కారల్ మార్క్సు— — 34
సైన్సువింతలు— — 36

**గేయం:**

తుమ్మెదపెండ్లి—శ్రీ కవిరావు — 24


## వ్యాఖ్యలు, విమర్శలు:

# హైదరాబాద్ ప్రజాప్రభుత్వం

శ్రీ బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గ స్థాపనతో హైదరాబాద్ రాజ్య చరిత్రలో నవ్య అధ్యాయం ప్రారంభమైంది. అనేక శతాబ్దాలుగా మహమ్మదీయ పరిపాలనలోనూ, జాగీర్దార్ల అధికారంలో మణిగిపోయిన ప్రజానీకం మొట్టమొదటిసారిగా తమ ప్రతినిధుల నెన్నుకుని ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపనకు తోడ్పడ్డారు. ఆర్థికంగానూ రాజకీయంగానూ బొత్తిగా వెనకబడిఉన్న హైదరాబాద్ ప్రజలు నేటికి రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందారు. ఇతర రాష్ట్రాలతో సమానమైన స్థాయినిఅందుకున్నారు

ఇంక ఆర్థిక పునర్నిర్మాణానికి ప్రజలూ ప్రభుత్వమూ కృషిచెయ్యడానికి పూర్తి అవకాశం లభించింది భారత ప్రభుత్వం నియమించిన సలహాదార్లు ఇద్దరున్నప్పటికీ బ్రిటిష్ పొలిటికల్ ఏజంట్ల తరహా కాక వీరు పరిపాలనా విధానంలో తోడ్పడి ప్రజాస్వామ్యాన్ని బలపరచగలరు మిశ్రమ ప్రభుత్వంలో ముఖ్యమంత్రిగా ఉన్న వెల్లోడీగారే సలహాదారుగా నియమించబడినందువల్ల నూతన మంత్రివర్గంపైన వీరి ప్రభావం ఏ రీతిగా ఉంటుందోనని శంకించేవారు లేకపోరు. కాని సలహాదార్ల ద్వారా భారత ప్రభుత్వం జోక్యం చేసుకునే అవసరం ఉండదనే మనం భావించాలి. మిశ్రమ ప్రభుత్వ కాలంలో కనపడిన సహకారభావమే ఇకముందు కూడా ఉంటుందని భావించవచ్చు.

హైదరాబాద్‌లో వెంటనే పరిష్కరించవలసిన కొన్ని ముఖ్య సమస్యలున్నాయి. సేద్యభూమి పట్టాలసమస్య, ఆర్థిక పునర్నిర్మాణం, పరిశ్రమాభివృద్ధి, విద్యావిధాన సంస్కరణ మొదలైన సమస్యలు జాగుచెయ్యడానికి వీలు కానివి. నూతన కాంగ్రెస్ ప్రభుత్వం కలిసినట్టుగా పనిచేసి ప్రజల విశ్వాసాన్నీ, సహకారాన్నీ పొందాలి సంస్థాన కాంగ్రెస్‌లో కక్షలు ప్రబలినప్పుడు సామరస్యం చేకూర్చడానికి పటేల్ నెహ్రూలు చేసిన కృషి ఫలించి శాసనసభ కాంగ్రెస్ పార్టీ నాయకుని ఎన్నిక ఏకగ్రీవంగా జరగడానికి తావిచ్చింది. శ్రీ దిగంబరరావు బిందూగారి అధ్యక్షతక్రింద కాంగ్రెస్‌లో కక్షలు

# హైదరాబాద్ మంత్రివర్గం



ముఖ్యమంత్రి
శ్రీ బూర్గుల రామకృష్ణారావు



శ్రీ దిగంబరరావు బిందూ



శ్రీ వినాయక్ రావు



శ్రీ వల్లూరి బసవరాజు



శ్రీ కొండా వెంకట రంగారెడ్డి



డా॥ చెన్నారెడ్డి



ఫూల్చంద్ గాంధీ



డా॥ జి. ఎస్. మేల్కోటే



బూర్గుల రామకృష్ణరావుగారిచేత రాజప్రముఖ్ నైజాం నవాబు ప్రమాణస్వీకారం చేయించారు.

విస్మరించబడినాయని చెప్పవచ్చును. కాంగ్రెస్‌లో అన్ని వర్గాలవారూ ఏకీభావంతో ఎన్నికలలో పాల్గొన్నారు. అదే సామరస్యభావం పరిపాలనా కర్తవ్యంలో కూడా గోచరించగలదని ఆశించవచ్చును. హిందూగారు కూడా మంత్రివర్గంలో ఉన్నారు. మంత్రివర్గ నిర్మాణం అన్నివర్గాలవారికీ తృప్తికలిగించే రీతిగా ఉన్నందువల్ల ప్రభుత్వం పరిపాలనా కార్యక్రమాన్ని దీక్షతో కొనసాగించగల అవకాశం లభిస్తున్నది.

## మార్కెట్లలో ఎలుగొడ్లు

ఫిబ్రవరి నెలాఖరున బొంబాయి మార్కెట్‌లో పోట్లగిత్తలు ఉన్నట్టే ఉండి ఒక్కసారిగా తోక ముడిచేశాయి. ముందుకుచూస్తూ వెనక్కి పరుగుతీసే ఎలుగొడ్లు మార్కెట్‌లో వీరవిహారం చేశాయి. ఉవ్వెత్తుగా గెడకర్రల్లా లేచిన ధరలు ఫెళఫెళా విరిగి కొసలు రాలిపోయాయి. ఇంకా మరెంత విరుచుకు పడిపోతాయోనని భయపడి వ్యాపారులు మార్కెట్లు మూసేసుకున్నారు. దేశం అంతటా పేరు మోగిన ఒక ఆసామీ నిలుచున్నపాటున 70 లక్షల రూపాయలు కక్కవలసివచ్చే పరిస్థితులు పులకు తాళాలేసుకుని వెళ్లిపోయాట్ట.

పెద్దపెద్ద మార్కెట్లలో వస్తుసామగ్రి టోకు ధరలు పడిపోయినా ఇంకా చిల్లర ధరలు అట్టే తగ్గలేదు. చిల్లరధరలుకూడా బాగా తగ్గడానికి పది పదిహేనురోజులు పట్టుతుందని ప్రభుత్వం అంచనా వేసింది.

ధరలు పడిపోయి వ్యాపారులు వెర్రెత్తిపోయినా, (కొందరికి లక్షలకి లక్షలు నష్టంవచ్చినా) పూర్వం వచ్చినట్లు ఆర్థిక మాంద్యం సంభవించదని. అందరూ చెప్తున్నారు. అంటే ధాన్యం ధర మూడురూపాయిలకి పడిపోవడం, బంగారానికి రెక్కలువచ్చి విదేశాల కెగిరిపోవడం, బాంకులికీ తాళాలు పడ్డం మొదలైన భయాలు లేవన్నమాట.

ఈ ధరలు తగ్గిపోవడాన్ని గురించి కొందరికింది కారణాలు చెప్పారు.

కొరియాలో యుద్ధం ప్రారంభమవగానే (జూన్ 1950) కర్పూరం మిరియాల మొదలు నూని చింతపండువరకూ అన్ని వస్తువుల ధరలూ ఇంకో తెర పెరిగిపోయాయి. ఆ పెరిగిపోవడం ప్రపంచమంతటా జరిగింది, మనందేశంలోనూ జరిగింది. జనరల్ మెకార్థర్‌ని డిస్మిస్ చెయ్యగానే (ఏప్రిల్ 1951) అమెరికా చీనాల మధ్య యుద్ధప్రమాదం తప్పిపోయిందని ప్రపంచమంతటా ఒక భావం స్థిరపడడంతో ధరలు తిరుగుముఖం పట్టాయి. యుద్ధ సంసిద్ధత కోసం అమెరికన్ ప్రభుత్వం అన్ని దేశాల్లోనూ ఎంత ధరకైనా సరే ముడివస్తువుల్ని కొనే జోరు అప్పటినించే తగ్గడం మొదలెట్టింది. అయితే అప్పటినించీ బ్రిటిష్ అమెరికన్ వ్యాపార కేంద్రాల్లో మెల్లిమెల్లిగా ధరలు తగ్గాయే కాని భారత దేశంలో మాత్రం తగ్గలేదు. మిగతా దేశాల్లో ధరలు తిరుగుముఖం పట్టడం ప్రభుత్వాలు జాగ్రత్తపడ్డం 1951 అక్టోబరు నవంబరు మాసాల్లో ధరలు నిలదొక్కుకోడం మళ్లీ 1952 సంవత్సరారంభంలో మెల్లిగా తగ్గడం జరిగింది. ఇతర దేశాల్లో 1951 లోనూ ఈ సంవత్సరారంభంలోనూ ధరలు తగ్గాయంటే మెల్లిమెల్లిగా కొద్దికొద్ది చొప్పున తగ్గాయి కాని నిలువునా కూలిపోలేదు. జనరల్ మెకార్థర్ డిస్మిస్ అయితే

(41-వ పేజీ చూడండి)

# ★ రెండు మహానగరాలు ★



చార్లెస్ డికెన్స్
1812–70.

అది ఒక

వైభవోజ్జ్వల మహాయుగం—వల్లకాటి అధ్వాన్నశకం, వెల్లివిరిసిన విజ్ఞానం–బ్రహ్మజెముడులా అజ్ఞానం, భక్తివిశ్వాసాల పరమ పరిధవం–పరమ పాషండాల ప్రల్లద కల్లోలం, ఉజ్వల చైతన్యాల ఉత్ఫుల్ల మహోదయం—అంధాంధ తమసాల అవ్యక్తనిశీథం; ఆశాకుసుమాలు పుష్పించిన ఆమధుర వసంతం—నైరాశ్యపు దలిగుబుళ్లు ఈచుకున్న శిశిరాస్యం, సర్వ సంపత్సమృద్ధి—సర్వతోముఖ క్షామం, స్వర్గానికి రాచబాట పుచ్చుకున్న జనం—నడుస్తున్నారు నరకానికి సూటిగా, అరుస్తున్నయ్ అధికార కంఠాలు, అంతా అమోఘంగా వుందని—సూక్ష్మంగా చెప్పాలంటే, నేటి పరిస్థితికి నకలుగ వుంది నాటి పరిస్థితి—

ఆ వాతావరణంలో,
లండన్ పారిస్ నగరాలను
రెంటినీ అలుముకుని సాగిన
ఉజ్వల గాధ :

# ★ A Tale of Two Cities ★

**19** వ శతాబ్దపు ఆంగ్ల రచయితలలో అగ్రగణ్యుడుగా పరిగణింపబడిన

## చార్లెస్ డికెన్స్

రచించిన ఈ మహోజ్జ్వల గాధను

## ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో

సీరియల్‌గా సంవత్సరాదినుంచి పాఠకులకు అందజేస్తున్నాం

# అదృష్టహీనుడు

"ఓకేయ్! గోపాలం! కంగ్రాచ్యులేషన్స్, కంగ్రాచ్యులేషన్స్." ఆదివారం పొద్దున ఎనిమిదిన్నరకు గోపాలం గదితలుపు తోసుకుని లోపలకు ప్రవేశించాను.

అంత పొద్దెక్కినా, ముసుగు బిగదన్ని పక్కమీద పిలికిలు తిరిగి పండుకొన్న గోపాలాన్ని చూడగానే యిదివరకటిలా నాకు అసహ్యం కలగలేదు. ఇదివరకైతే ఆ ముసుగులోపల గోపాలం ఏ దరిద్రదేవతనో నచ్చగా కౌగిలించుకొని పండుకొన్నట్టు తోచేది. కాని యివ్వాళ ఆ మురికి మరకలు పిగిలిపోయిన దుప్పటి ముసుగులో వున్నది లక్ష్మీదేవత! ఎనభైమూడు వేల రూపాయలు - బంపర్ ఆఫర్ - ఫస్టు ప్రైజ్!

ఎనభైఅయిదు రూపాయల గుమాస్తా గోపాలం శ్రీలక్ష్మి వచ్చిన ఆలింగనంలో కునుకులు తీస్తున్నాడు. ఎంత అదృష్టవంతుడు! అందుకేకదూ 'అదృష్టం చెప్పి రాదంటారు'! లక్ష్మి రాదలుచుకుంటే యింటికప్పునైనా బగలకొట్టుకొని వస్తుందట. ఇంతవరకూ తనకు క్రాస్‌వర్డ్ పజిల్లో ప్రథమ బహుమానం ఎనభైమూడు వేలు వచ్చిన సంగతి గోపాలానికి తెలియదుకదా! ఆ సంగతి ముందుగా చెప్పే అవకాశం నాకు కలిగినందుకు ఎంతో సంతోషంగా వుంది. సంతోషం పట్టలేక నిద్రపోతున్న గోపాలాన్ని రెండు కుమ్మీ పోట్లు పొడిచి, కప్పుకొన్న దుప్పటి సగంవరకూ లాగి వదిలేశాను.

> అదృష్టం, అదృష్టం అనుకుంటాం. కాని కాస్త కాలం గతితప్పితే అదృష్టమూ దురదృష్టమూ ఒకే రీతిగా గోచరిస్తాయా?

"అబ్బ! ఏమిట్రా గొడవ పొద్దున్నే?" అంటూ, బద్ధకంగా లేచి కూర్చొని వళ్లు విరుచుకొన్నాడు గోపాలం.

## "వనిత"

"ఎనభైమూడు వేలు! ఫస్టుప్రైజ్! గెల్చావు; లే ముందు, కాఫీకి పోదాం పద"

గోపాలం నా చేతిలోని పత్రికను ఆత్రంగా తీసుకొని క్రాస్‌వర్డ్ సొల్యూషన్ వున్న పేజీ తీసిచూశాడు.

గట్టిగా నిట్టూర్చి నీరసంగా పేపరు అవతల విసిరేశాడు. నిరాశ, నిస్పృహల్లో మునిగిన వాణ్ణి చూస్తుంటే నాకు ఆశ్చర్యం కలిగింది. అనుమానంతో అన్నాను—

"అయితే మరి నీవి ఆల్ కరెక్టుగాదా?"

"ఊహూఁ"

"నువ్వు ఆరోజు పూర్తిచేసింది అంతా యిలాగే వుందిగా?"

"తర్వాత మార్చేశాను."

"ఏం? ఎందుకని?"

"ఇంతకీ ఆ సుబ్బారావుగాడు చేశాడు" విచారంగా అన్నాడు గోపాలం.

నాకు వెంటనే జ్ఞాప్తొచ్చింది. ఆ రోజు గోపాలానికీ, సుబ్బారావుకూ వాదన జరిగింది. ఈ పజిల్సుపిచ్చిలో యిద్దరూ ఒకళ్లను మించినవాళ్లు మరొకరు. గోపాలం రెండు అర్థంలో 'వనిత' వుండాలంటే సుబ్బారావు 'కవిత' వుండాలనీ, వాదించుకొన్నారు. చివరకు ఎవరిమట్టుకు వాళ్లు తమది కరక్టు అనుకొని పజిలు పూర్తి చేశారు.

"అయితే మరి నువ్వారోజున 'వనిత' వుండాలనేకదూ వాదించావ్?"

"వూఁ" అవునన్నట్టు గోపాలం తల పైకీ కిందకీ ఆడించాడు.

"అట్లాఅయితే నీదే రైట్ అయిందిగా?"

"లేదురా! తీరా పజిలు పంపేటప్పుడు సుబ్బారావు అన్నదే నిజమేమోననీ 'వనిత' కు మారుగా 'కవిత' అని పూర్తిచేశాను"

"ఏడవలేకపోయావ్? వెధవా! అసలు నువ్వు వొట్టి, ఫన్నాసివిరా" నాకు వళ్లు మండిపోయి అనేశాను. ఆ స్థితిలో యింకేం తిట్టినా గోపాలం వూరుకొంటాడని తెలుసు. అవకాశం దొరికితే ఆడని నాలుక ఎవరినోట్లో వుంటుంది? అప్పుడు వాణ్ని ఏమి నిందించినా వాడంటే నాకున్న సానుభూతిలోనే.

"సరేలే, లేచి మొహం కడుగు; అలా పోదాం" అని నేను అంటూండగానే సుబ్బారావు మాంచి వుషారుగా లోపలికి వచ్చాడు. వస్తూనే అన్నాడు—

"గోపీ! అభినందనాల్రోయ్ ప్రథమ బహుమతి యిద్దరం పంచుకొన్నాం"

గోపాలం ఆముదం తాగిన మొహం పెట్టాడు. కథ అడ్డం తిరిగింది, కాదు అదృష్టమే అడ్డంతిరిగింది.

గోపాలం అభిప్రాయమే బాగుందని తను రాసిన 'కవిత' కు మారుగా 'వనిత' రాసి పూర్తిచేశాడు సుబ్బారావు. పర్యవసానం - ఫస్టుప్రైజ్ - గోపాలానికి రావాల్సింది సుబ్బారావుకు వచ్చింది.

"సగమేం కర్మరా? మొత్తం - ఎనభై మూడు వేలు నీవేరా; అదృష్టంరా - అదృష్టం! నీవు లక్కీ ఫెలోవ్ రా"

గోపాలం తరఫునకూడా నేనే అభినందించాను సుబ్బారావుని

ముగ్గురం కలిసి హోటలుకుపోయాం. బిల్లు చెల్లించి సాయంత్రం కనిపిస్తానని చెప్పి సుబ్బారావు వెళ్ళిపోయాడు గోపాలం, నేను మాగదికి బయలుదేరాం

గోపాలంముఖాన కత్తిగా వేసినా నెత్తురు చుక్క లేదు తల వేళ్ళాడేసుకొని, కాళ్ళీడ్చుకుంటూ నడుస్తూన్నవాణ్ణి చూస్తూంటే జాలివేసింది. పట్టి దామోదరయ్య. ఆ! యీ చవురు మొహానికి అంత అదృష్టంకూడానా? వుసూరుమంటూ దేవయ్యలా వుంటూ డెప్పుడూను అబ్బే! నే నెప్పుడో అనుకున్నాను ఎప్పుడూ మొహాన పెద్దమ్మ తాండవిస్తూంటే వీడికి అంత అదృష్టం ఎలా వచ్చిపడుతుంది? వళ్ళో కొచ్చి పడిన లక్ష్మిని చేతులారా జారవిడుచుకొన్నాడు గదా వూ! అవతారంకొద్దీ బుద్ధులూ-బుద్ధులకొద్దీ అదృష్టమూను

ఇంతకీ సుబ్బారావు జాతకపురుషుడు వాడి కెప్పుడూ యింతే ఏదో రకంగా కలిసి వస్తూంది వాడు పట్టుకొన్నది బంగారం వాడి మొహాన లక్ష్మి కళకళలాడ్తూ వుంటూంది ఎంత చలాకీగా వుంటాడు! ఇన్నిటికీ ఆ గీత వుండాలి! కలిసొచ్చేరోజుల్లో నడిచివచ్చే పిల్లలు పుట్టారట! 'అది' లేకపోతే ఎన్ని చేసినా వ్యర్థమే కాకపోతే యీ గోపాలానికి యీ బుద్ధి ఎందుకు పుట్టాలి?__

"గోపీ! ఎవరికైనా తను చేసేపనిలో నమ్మకం వుండాలిరా"

"ఏమో? నీవన్నదాన్లో నాకేం నమ్మకం లేదు"

"అదికాదురా నువ్వు నిజమని నమ్మిన దాన్లో పూర్తిగా విశ్వాసం వుంచాలి వొకసారి ఇది సరైనదీ అని నమ్మితే, ఏ పరిస్థితిల్లోనూ దాన్నే దీక్షతో కొనసాగించాలి నీమీద నీకు నమ్మకం లేకపోబట్టే కదా ఎనభైమూడు వేలూ దూరమైపోయినై దేనికైనా ఆత్మవిశ్వాసం కావాలి ఆత్మవిశ్వాసం కోల్పోయిన వ్యక్తులెవ్వరూ జీవితంలో ముందుకురాలేరు"

"ఆత్మవిశ్వాసం లేకపోబట్టే సుబ్బారావుకు ఆ ప్రైజ్ వచ్చింది. వాడి అభిప్రాయంమీద వాడికి నమ్మకంవుంటే వాడికి అది ఎలా వచ్చేది? ఆత్మవిశ్వాసం లేకపోబట్టే వాడి అదృష్టం పండింది"

ఓరి వీడి తస్సాదియ్యా! గోపాలం ఎంత తెలివిగా మాట్లాడాడు! వాడు అప్పుడప్పుడూ తెలివిగా మాట్లాడుతాడు గోపాలం అన్నదాన్లో సత్యం లేకపోలేదు అయినా వాడి తెలివితేటలు అక్కరకొచ్చేవికావు మరి

సుబ్బారావూ, గోపాలమూ నాకు చాలా దగ్గరి స్నేహితులు అసలు సుబ్బారావు గోపాలంద్వారానే పరిచయమయాడు. మొత్తంమీద మా ముగ్గురిస్నేహం లక్కలా, వానాకాలం మావూరి బురదలా చిక్కగా అతుక్కుపోయింది

* * *

సుబ్బారావు మా గదికివచ్చి, నన్నూ గోపాలాన్నీ బెజవాడ వెళ్దామని బలవంతం చేశాడు

పెందలాడే వెళ్తే బ్యాంకిలో చెక్కు మార్చుకొని మ్యాటినీ సినిమా చూసి రావొచ్చుననీ, మా యిద్దర్నీ తొందరచేసి ప్రయాణం చేయించాడు. నా బలవంతం లేకపోతే గోపాలం వచ్చేవాడుకాదేమో! ఇంత స్నేహంగావుండీ రాకపోతే అసూయకొద్దీ రాలేదని సుబ్బారావు అనుకోవచ్చని ఎంతో చెప్పిన తర్వాతగాని గోపాలం బయలుదేరలేదు

సుబ్బారావుకు దగ్గరవాళ్లల్లో వొకడైన సుబ్రహ్మణ్యంతో సహా సుబ్బారావూ, నేనూ, గోపాలం అంతా నలుగురం మావూరినుంచి పదకొండుగంటలకు బయలుదేరే బెజవాడ బస్సు ఎక్కి కూర్చున్నాం.

బెజవాడ చేరగానే సుబ్బారావు మమ్మల్ని హోటల్లోవిడిచి తను బ్యాంకుకుపోయి ఎనభైమూడువేల రూపాయల చెక్కు మార్చుకొని వచ్చాడు వస్తూ దోవలో హేండ్ బాగ్ కొని అందులో నోట్లు పెట్టుకొని మాంచి అట్టహాసంగా వచ్చాడు.

తర్వాత గవర్నరుపేట, గాంధీనగరూ అంతా చెడా బడా తిరిగి సుబ్బారావుకు కావాల్సిన బట్టలూ అవీ యివీ కొని, ట్వీడ్ సూట్సుకు ఆర్డర్ యిచ్చి మాటినీకి వెళ్లాం ఆ మధ్యలోనే సుబ్బారావుని మా కంపెనీ వాళ్లతో ఏదో గుసగుసలాడేడు అందులో జొరబడితే వీడికి మంచి భవిష్యత్తు వుంటుందని నే నప్పుడే అనుకొన్నాను.

సినిమా వదలగానే సరాసరి బస్సుస్టాండు దగ్గర కొచ్చాం సాయంత్రం ఆరుగంట లవడంచే బస్సుస్టాండు అంతా ప్రయాణికులతో కిటకిట లాడుతోంది. ఇళ్లకు పోవాలనే ఆదుర్దాతో జనం అంతా బస్సు వచ్చీ రావడంతోనే తోసుకొని ఎక్కుతున్నారు ఎలాగైతేనేం మేము నలుగురం నానా అవస్థపడి మావూరిబస్సు ఎక్కి కూర్చున్నాము వాళ్ళ అదృష్టం కొద్దీ సుబ్బారావుకూ, సుబ్రహ్మణ్యానికీ ఫ్రంట్ సీటు దొరికింది నేనూ, గోపాలం వెనక సీటులో కూర్చున్నాం అంతలోనే గోపాలం సిగరెట్ తెచ్చుకుంటానని దిగి వెళ్ళాడు

బస్సు బయలుదేరే టైం అవుతున్నా ఎంతసేపటికీ తిరిగి రాకపోతే గోపాలాన్ని వెతుక్కుని వద్దామని నేనూ బస్సుదిగాను. బస్సుస్టాండ్ వెనక వున్న కిళ్లీషాపులూ

(19-వ పేజీచూడండి)

రోజుల్లో చచ్చేవాడికి నా కెందుకొచ్చిన కంఠశోష చెప్పు?

రామం : అదో మళ్ళీ చావె!...

మో : చాల్లే - మళ్ళీ నీ వెందుకంటావు ఆ మాట... సరే ఆ తెచ్చినవస్తువులేవో చెప్పు వింటాను.

రామం : (జేబులోనుండి, కాయితాలు తీసి చదువుతాడు) మూడు డజన్ల వాషింగు సబ్బులు... రెండు డజన్ల టాయిలెట్టు సబ్బులు, 15 టిన్నుల సావికెట్టులు, మూడు గ్రోసుల కత్తెరమార్కు సిగరెట్టు పెట్టెలు, రెండుగ్రోసుల నిప్పుపెట్టెలు 10 కాఫీ డబ్బాలు అందులో అయిదు బ్రూకు బాండులు, అయిదు పాల్సన్సుటిన్నులు, కోకో డబ్బాలు నాలుగు, ఓవల్టీనులు యెనిమిది, మూడు స్నో సీసాలు.

మో : యేమిటీ వెధవసామానులన్నీ రామం! ఈ చుట్టపీకలకే యిన్ని రూపాయలయితే యెలాగు చావాలి?

రామం : అదో మళ్ళీ చావు.

మో. చాల్లే మళ్ళీ అని చావకు ఆ మాట ఊ-కానీ-యింకా యేం సామాను తెచ్చావు?

రామం : అయిదు డబ్బాల పొగాకు చుట్టలు

మో. వాడి పాడెకట్టలు. వెధవముట్టలు. వచ్చే వెధవలంతా చుట్టలు తాగే చచ్చే అట్టుంది.

రామం : అదో మళ్ళీ చావు

మో. చాల్లే మళ్ళీ అని చావకూ, ఊ.. యింకా నేమిటి ఆ వెధవపద్దులు చదువు.

[పేరంటం వస్తాడు]

పేరంటం. బాబుగారూ! బ్యాండో ళ్లొచ్చారండీ!

మో : బయటనే చావమను

రామం. మళ్ళీ చావే!

మో : చాలు వూరుకో - మళ్ళీ అని చావకు!

[అవధాని వస్తాడు]

అవ : మహదైశ్వర్యాభివృద్ధిరస్తు, రాజద్వారే రాజముఖే సర్వదా దిగ్విజయమస్తు.

మో : రండి అవధాన్లగారూ రండి కూర్చోండి. విన్నారా యిప్పటి పెళ్లిళ్ల వేషం. చుట్టముక్కలకు, కాఫీ డబ్బాలకే కొంప దుల్లు అవుతుంది. ఆడపిల్ల పెళ్ళిళ్ళంటె అశ్వమేధయాగాలు చెయ్యడం చాలా సులభం అనిపించిందండీ నాకు! యేదో యింత పప్పన్నం పెడితే వచ్చిన జనం తింటారు పోతారు.

అవ : (పెద్దగా నవ్వుతాడు) అందుకే 'పెళ్లి చేసి చూడ'మన్నారు పెద్దలు. అయితే మోహన్‌రావుగారూ! మీబోటి అగర్భ



శ్రీమంతులే యిలాగంటె యెలాగా అని ఏదో కాలాన్ని పాత్రాన్ని అవశ్యం మనం అనుసరించాల్సిందే, లేకుంటే అపహాస్యం

మో. అంతే. అంతే అక్షరాల అంతే.

[పేరంటం వస్తాడు]

పేరంటం : బాబుగారూ! పెళ్ళికొడుకొచ్చారండి. మీతో మాట్లాడాల్సిన పనుందట.

మో : ఆ.. పెళ్లికొడుకేమిటి. రావడమేమిటిరా.. అందులో పెళ్ళికాకముందే రావడమేమిటి. యేమిటో చిత్రంగా వుంది నాకేమి తోచకుండావుంది అవధాన్లగారూ! అరె పేరంటం. నిజంగా పెళ్లికొడుకేనా లేక యింకెవరినయినా చూచి అంటున్నావా.. తెలివితక్కువ వెధవా.

పేరం : లేదు బాబుగారూ...నిజంగానే. పెళ్లికొడుకేనట.

అవ పెళ్లికొడుకే కావచ్చులెండి వాడు అబద్ధం యెందుకు చెపుతాడు. అయినా మోహన్‌రావుగారూ! పెళ్లి కాందే అల్లుడు యింట్లోకి రాకూడదుకదండీ?

మో. అవధాన్లగారూ! నాకు యిక చావే వచ్చిందండీ.

రామం : అదో మళ్లీ సాయింగారూ..!

అవ : ఆ.. దానికేం లెండి యిప్పటి తరహా యింతే.. మనం వద్దంటెమాత్రం వూరుకుంటారా యిప్పటి పిల్లలు మోహనరావుగారూ! వాడుకాలం కాకపోతే మరేమిటి?

మో యేమిటి కర్తవ్యం అవధాన్లగారూ! యింట్లోకి వివాహానికి పూర్వం రాకూడదంటే ఆయన గారికేం కోపమొస్తుందో? నేను యెలాగు చచ్చేదండి అవధాన్లగారూ!

రామం : మళ్లీ చావు.. చావు.. చావు.

మో : చాల్లే రామం. మళ్ళీ అని చావకురా నాయనా! యిది వరిహాసాలకు సమయం కాదు. నా నెత్తిన పిడుగు పడింది.. బుద్ధి కూడా పని చెయ్యడం లేదు...అవధాన్లగారూ?.. రామం, నాకు మంచి ఆలోచన చెప్పండి.

రామం: ఆలోచనకల్లా యేముందండీ! అల్లుడు వచ్చి యింటిముందు నిలుచున్నాడాయెను. యిప్పుడు మనం కూర్చున్న వసారాలోకి వస్తే మాత్రం తప్పేముందంటావు బావా! యేం అవధాన్లగారూ!

అవ: (నిట్టూర్పు విడచి) యింతమాత్రం పనికిరాదులెండి. మన సాంప్రదాయాలు చూసుకుంటామా లేక మెహమాటాలు చూసుకుంటామా మోహనరావుగారూ! బాగా జ్ఞాపకం వుంచుకోండి. యిది కలియుగం! సాంప్రదాయాలకు విరుద్ధంగా మనం యేదిచేసినా కాకుల్లాగ లోకులు పొడుచుకవస్తారు. కాస్త ఆలోచించి మరీ పనిలోకి దిగండి

మో: అయితే అవధాన్లగారూ! నేనే వెళ్లి బయటద్వారంవద్ద మాట్లాడ్తాను. లోపలికి రావడం బాగుండదని నచ్చచెప్పుతాను. అయినా యిప్పుడు ఆయనకున్న పనేముంది ఈ యింట్లో.. యేమో... యేటూ తోచడంలేదు. అయితే అవధాన్లగారూ.. మీ రిద్దరూ యిచటనే వుండండి ఆయనతో మాట్లాడి యిప్పుడే వస్తాను. (వెళ్లిపోతాడు)

రామం: కాని బావా జాగ్రత్త.. మాటలధోరణిలో మళ్ళీ చావులు బతుకులు అని ఆయన్ని నొప్పించేశేవు?

మో: చాలేవోయి. మళ్ళీ ఆ వెధవ కూతలూ నీవూనూ.

(వెళ్తాడు)

(తెర)

## రెండవ రంగం

[ప్రదేశం. యింటిముందు, వేపచెట్టు నీడలో మురళి పచారుచేస్తుంటాడు. నోట్లోనుంచి గుప్పుగుప్పున సిగరెట్టుపొగ వదుల్తుంటాడు]

మోహన్: (ద్వారంనుండి బయటికి వస్తాడు)

మురళి: నమస్కారమండీ (సిగరెట్టు పక్క విసిరి మర్యాదగా నిలబడి వుంటాడు)

మో: యేం నాయనా. యేదో పనిమీద వచ్చావే. అయ్యో నిలబడే వున్నావే నా తెలివి తెల్లవారినట్టే వుంది. (అటు యిటు చూచి) అరే పేరంటం. ఓరి పేరంటం. యెక్కడున్నావురా తెలివి తక్కువెధవా. రెండు కుర్చీలు పట్టుకరా

ముర: అక్కర్లేదులెండి ...యింట్లోకి వద్దండి మీతో కొన్ని విషయాలు మాట్లాడాల్సి వుంది.

మో: యింట్లోకా నాయనా...ఆ.. అయినా యింట్లోకెందుకులెండి కాదు. మీరు యేమీ అనుకోకండి...యిదో... రేపు రాత్రికి ముహూర్తం అనుకున్నాం కదా! అంత పూర్వం యింట్లోకి రావడం బావుండదని నాయనా — అంతే గాని వేరేమిలేదు. నలుగురూ నాలుగు విధాల అంటారు నలుగురు నరకెందుకూ! మీ నాయనగారు వూరుకుంటారా చెప్పండి. ఏదో మీది కుర్రతనం కాబట్టి కష్టసుఖాలు తెలియవు మీకు.

ముర: ఈసాంప్రదాయాలకేంలెండి. నేను వచ్చింది అసలు మీ అమ్మాయిని చూడడానికి! నాకు తెలియకుండానే ముహూర్తం నిశ్చయం చేసుకున్నారు. తర్వాత నన్ను నాన్నారు బొంబాయినుండి పిలిపించారు నేను అమ్మాయిని చూడలేదు. అసలు ఆవిడను చూడందే పెళ్ళి యెలాగు చేసుకునేది చెప్పండి!

మో: మీ వాళ్లందరూ అమ్మాయిని చూశారుగా నాయనా! పిల్లకేం బంగారు తునక, యేమీ వంక లేదు.

ముర: అయినా నేను అమ్మాయిని చూడందే పెళ్లిచేసుకోనండీ! పెళ్లి నాది ఇంకెవరిది గాదు

మో: అంత పట్టు పట్టితే యెలాగు నాయనా! పెద్దవాణ్ణి నామాట విను మీ నాయన ఒకటి నేనూ ఒకటేనా! రేపీ పాటికి అంతా అయిపోతుంది ఒక్క రోజుకొరకు యెందుకీ పాడుప్రపంచంతో అనిపించుకోవడం?

ముర: ఊ వెధవ ప్రపంచం, నాకు ఈప్రపంచంతో పనిలేదండి, నేను అమ్మాయిని చూడందే పెళ్లిచేసుకోను, యేదియేటయినా సరే తర్వాత మీ యిష్టం.

మో: తొందరపడకు నాయనా! కాస్త ఆలోచించు.

ముర: నేను యెక్కువగా మాట్లాడలేనండి. అమ్మాయిని చూపించడం యిష్టం లేకపోతే మీరు యింకో సంబంధం చూసుకోవచ్చు (వెళ్ళిపోతాడు)

రామం: (త్వరగా యింట్లోనుంచి వస్తాడు) ఆగండి — ఆగండి — అంత తొందరపడ్తారేం — యేదో బావగారు పూర్వకాలం మనిషి యేదో అన్నాడనుకోండి, దానికేంగాని రండి వెళ్దాము, అమ్మాయిని చూసుకుందురుగాని (మురళి చెయ్యిపట్టకొని లోపలికెళ్తారు)

మో: చేసే దేముంది...కడుపుకోసు

యెక్కెన్నా భరించుకోవాలి యిదంతా నా చావుకొచ్చింది యేదోవిధంగా పెళ్లి యెత్తిపోకుండా చూసుకుంటూ (లోపలికి వెళ్తాడు)

[ తెర ]

(మూడవ రంగం)

[ప్రదేశం - యింటివసారా-మోహన్ రావు - రామం, అవధాని మురళి కుర్చీలల్లో కూర్చుని వుంటారు]

అవ. అమ్మాయిని చూడక తప్పదంటారా?

ముర: అవునండి చూడాలనే వచ్చాను.

మో: యివ్వాళ్లి తిథివార నక్షత్రాలు యెలాగున్నాయి? యేం అవధాన్లగారూ!

అవ: తిథివార నక్షత్రాలకేంలెండి (పంచాంగం విప్పుతాడు) బాగానే వున్నాయే!

ముర: పోనిత్తురూ - యింకా బూజు పట్టిన భావాలూ మీరూ పూర్వం మాత్రం కన్యలను చూడందే పెళ్లిచేసుకున్నారటండీ! స్వయంవరాలంటే వినలేదూ?

అవ: సరే. మోహన్‌రావుగారూ! కానివ్వండి యేం చేస్తాం! శుభస్య శీఘ్రం.

మో: రామం! పో - అమ్మాయిని తీసుకరా!

[రామం లోపలికి వెళ్లి అమ్మాయితో మళ్ళీ వస్తాడు]

మో. అమ్మాయి! రా - అమ్మా రా... పరాయివాళ్లెవరూ, రా! కూర్చో అమ్మా రా...!

దేవ (ఓ కుర్చీలో కూర్చుంటుంది)

మురళి: (అమ్మాయిని పరిశీలించి రెండు నిముషాలు చూసి) అమ్మాయి పేరు?

రామం: దేవకీదేవి!

ముర: అబ్బో...రాచబిడ్డపేరు ..వెరీ గుడ్.. చాలా బావుంది.(అమ్మాయిని బాగా చూస్తాడు) అమ్మాయ్ యింగ్లీషు చదువుకున్నావా?

దేవ: (అవునన్నట్టుగా సిగ్గు అభినయిస్తూ తలవూపుతుంది)

రామం: ఓ ఆంగ్లో ఇండియన్ లేడీవద్ద చదివించాం లెండి.

ముర: యేదీ. న్యూస్ పేపరులో యెక్కడయినా చదివి వినిపించు (చేతిలో వున్న ఇంగ్లీషు న్యూస్ పేపరు అమ్మాయి చేతికిస్తాడు)

(దేవకీదేవి ఇంగ్లీషు పేపరులో ఒక పేరా చదువుతుంది.)

ముర: ఎక్సెలెంటు — నైస్...వెరీ నైస్ ప్రొనన్సియేషన్. మంచి ఉచ్చారణ, ఆంగ్లో ఇండియన్ లేడి వద్ద గదూ చదివించారూ? అదీ రహస్యం - యీ యితరులతో చెపితే అంత చక్కని ఉచ్చారణ రాక పొయ్యేది......సరి...అమ్మాయికి సంగీతం వచ్చా!

రామం: అవును యేదో కొత్త వచ్చులెండి. ఈ వూళ్ళో వున్న ఆధునిక ఆంధ్ర గాంధర్వ సరససంగీత విద్యాలయంలో సంగీతం చెప్పించాము.

ముర: ఓ పాట పాడమ్మాయ్!

మో: ఆ ఆ.. అదేమిటండీ అమ్మాయి యెట్లా పాడుతుందండీ!

ముర: అమ్మాయి సిగ్గుపడుతుందంటారా.. విద్యను ప్రదర్శించటానికి సిగ్గెందుకమ్మాయ్...పాడు.

రామం: పాడమ్మాయి పాడు. —సిగ్గెందుకూ?

దేవి: (సిగ్గు అభినయిస్తూ పాడుతుంది)

పాట: శ్రీరామా సీతారామా—కాపాడరావా, కాపాడరావా! రామహరే—శ్రీ రామహరే రఘురామహరే

ముర. ఓహో. ఎక్సెలెంటు. మార్వెలెసు.. భేష్ నాకు అమ్మాయి నచ్చిందండీ ... యింక వస్తానండి (వెళ్లబోతుంటాడు)

(మోహన్‌రావు, మురళిని సాగనంపటానికి వెంట నడుస్తాడు )

దేవ: (కుర్చీలోంచిలేచి) నాన్నగారూ ఆగండి...వారుమాత్రం నాకు నచ్చలేదు. వివాహానికి పూర్వం కన్యలను పరీక్షించే అధికారం మొగాళ్ళకుంటే, మొగాళ్ళను పరీక్షించే అధికారం ఆడపిల్లలకు అక్కర్లా? వారిని పెళ్లిచేసుకోవడం నాకు యెంతమాత్రం యిష్టంలేదు.

మో: ఆఁ ఆఁ. వూరుకో అమ్మాయ్. నీకెందుకమ్మా గోలంతా! నీవు అలాగ అనకూడదమ్మా తప్పు తప్పు.

మురళి: (అమ్మాయినిచూచి) ఆ.. అదేమిటమ్మా. నన్ను పరీక్షచేయందే ఫేలు చేశావే!

దేవ: (తండ్రితో) వారిని పరీక్షించడం నాకు అనవసరం. వారికీ నాకూ ఆకాశానికీ భూమికీ వున్న తేడా వుంది. నేను పదహారణాల భారతస్త్రీని. వారు పదహారణాల విదేశీయ సంస్కృతిగలవారు నేను వివాహాన్ని ఆత్మబాంధవ్యంగా యెంచుకుంటాను. వారు శరీరబాంధవ్యంగా యెంచుకుంటారు. వారిదృష్టికి నా సౌందర్యం, శ్రావ్యమైన నా గొంతు నచ్చినవి. రేపు యే వ్యాధిపీడితనో అయి ఈ సౌందర్యం కోలుపోయినా, శ్రావ్యమైన ఈ గొంతు చెడ్డా వారి కళ్లు నన్ను చూడనొల్లవు వారికి బోలెడు విజ్ఞానం వుండొచ్చు కాని మానవత్వం వున్నట్టు కనబడదు. సంత విక్రయ పశువును చూచినట్టుగా నన్ను పరిశీలించి చూస్తున్నారు వీరు, సౌందర్యం ఒంపులూ, రూపురేఖలూ ఆరాధించేవారనే విషయం మీరు మరవకండి నాన్నారూ! వివాహాన్ని ఆత్మబాంధవ్యంగా యెంచుకునే యువకుడే నాకు కావాలి, సౌందర్యారాధకురాలు ఆయనకు దొరుకుతుంది. నాన్నారూ! వారితో చెప్పేసెయ్యండి. నాకు వారు నచ్చలేదు. వారిని నేను వివాహం చేసుకోను. యిది నాదృఢనిశ్చయం.

మో: ఆఁ దేవకీ, నాముద్దుబిడ్డా! నీ యిష్టమే నా యిష్టం నీయిష్టంలేనితర్వాత అంతా ఒట్టిదే! (మురళివైపు చూస్తూ) వింటున్నావుగదా నాయనా. అమ్మాయికి నీవు నచ్చలేదట.. నాకు చాలా విచారంగా వుంది ... యింకెక్కడయినా నీకు నచ్చిన సంబంధం చూసుకో

మురళి: (కోపంగా మోహనరావువైపు, దేవకివైపు చూస్తూ) బ్రూట్సు...స్కౌండ్రల్సు ... (అంటూ చరచరా వెళ్ళిపోతాడు)

రామం: యేమిటి యిదంతా అమ్మాయ్. యిక ఈ పెళ్లి యెత్తిపోవలసిందేనా? ప్రపంచం యేమంటుంది!

మో: పోడు ప్రపంచం యేమన్నానరే రామం. నీవుమాత్రం అమ్మాయిని యేమన్నా ఒప్పుకోను. ఆత్మగౌరవంగల

(12-వ పేజీ చూడండి)

# వ్యక్తిత్వాదరణ

తీవ్రంగా వాంఛించినంత మాత్రాన, అనుకున్నవన్నీ అనుకున్నట్టుగానే జరిగితే, అరవిందం పరిస్థితి యిప్పుడున్నట్టుండేదికాదు తన జీవితాన్ని గురించి యోచించినకొద్దీ మరీ అయోమయంగా ఉంటోంది. రెండేళ్ళకిందట ప్రపంచమంతా ఒక యింద్ర ధనుస్సులా ఆనందంగా ఉండేది అరవిందానికి యింటర్ చదివే రోజుల్లో ఎన్నో జీవితపథాలు నిర్మించుకున్నాడు తండ్రి సంపాదన, తన కాలేజీ చదువు భరించేటంత పెద్దదికాకపోయినా నెలకి అరవైరూపాయిలూ బిళ్ళకుడుముల్లా పంపుతుండేవాడు తండ్రి తన తరువాత అంతటివాడయిన అరవిందం ఏ పెద్ద చదువయినా అయితే, మిగిలిన తమ్ముళ్ళకి, చెల్లెళ్ళకి అండగా నిలుస్తాడని ఆ తండ్రికి ఆశ అరవిందం కూడ అవసరమయినంతలో క్లుప్తంగా గడుపుకునేవాడు అందరి అభిమానమూ చూరగొన్నాడు. తన రచనలు లేనిదే కాలేజీ పత్రికలూ, తన ప్రసంగం లేనిదే సమావేశాలూ, తన గానం లేనిదే కాలక్షేపాలూ రక్తికట్టవని పేరు పొందాడు. ఆ వయసులోనే, లెక్చరర్లచేత అంత మన్నన, తోటి విద్యార్థులచేత అంత గౌరవం పొందే అరవిందం, అప్పుడప్పుడు యిది భావిలోకలిగే విషమ పరిణామానికి సూచనేమోనని భయపడేవాడు. యింటర్ రెండో సంవత్సరంలో, సారస్వత పోటీలలో ఉత్తమ బహుమతి నందుకున్నాడు అరవిందం. ఆవ్యాసం ప్రిన్సిపాల్ సభలో చదివి వినిపించి అరవిందాన్ని పొగిడారు ప్రిన్సిపాలుగారంటే సామాన్యులుగారు అటు ఆంగ్లేయ సాహిత్యాన్ని, యిటు ఆంధ్ర వాగ్గేయకారకుల్ని జీర్ణింపచేసికొన్న ఒక మహావ్యక్తి ఆయన మన్ననలందటం సాధారణమయినవిషయం కాదు తెలుగు లెక్చరరుకూడా యింత చిన్నవయసులో యింత విజ్ఞానం వికసించి ఉండటం నేనెక్కడా చూడలేదంటూ ఆనందబాష్పాలువిడిచారు అరవిందానికి యిదంతా కలగా ఉంది అంతమంది సాహిత్యవేత్తలుతన్ను పొగుడుతున్నారంటే భయంగాకూడ ఉంది. ఆనాడు అరవిందం రూముకివచ్చి చూసికునేసరికి ఒకజాబు పడిఉంది మధ్యాహ్నం పోస్టువాడు కిటికీలోంచి వేసిఉంటాడనుకుంటూ, కవరు చింపిచూశాడు అది తండ్రి రాశాడు. నెల మధ్యరోజుల్లో డబ్బు పంపడం కష్టమని, పైనెల జీతం తీసుకోగానే తప్పకుండా పంపుతానంటూ వ్రాశాడు తండ్రి అవును. తన కుటుంబ పరిస్థితులన్నీ తనకి తెలుసు. ఆజాబు సాంతంగా చదవలేకపోయాడు యీనాడు తనూ ఏదో పనిచేసి యాభై రూపాయలు తెస్తే, తన తండ్రి కెంత నిశ్చింతగా ఉంటుంది అసలు తను యీ కాలేజీలో చేరకుండానే ఉద్యోగం చూడవలసింది ఈ ఆలోచనల్లో అరవిందానికి, తనకి కాలేజీ చదువుల ఆశ కల్పించి, ఆ మూడుముళ్ళువెయ్యగానే, మొఖం చాటేసిన వ్యక్తులమొహాలు జ్ఞప్తికివచ్చాయి. అటువైపు వాళ్ళని తలచుకోవడమే మానివేశాడుతను. తమ అవసరాలకోసమై, యితరుల జీవితాలని నాశనంచెయ్యటానికైనా వెనుదియ్యని ఆ చీడపురుగులకి తన హృదయంలో స్థానం లేదనుకున్నాడు అరవిందం . పోనీ... యీ పడంగావెళ్ళి ... తండ్రికి సాయపడదామనుకున్నాడు కాని... యిక మూడునెలల్లో యింటర్ అయిపోతుంది. పండివచ్చిన ఫలాన్ని తన్నుకోవటంకంటే ఓపికపట్టి మూడునెలలుందామనుకున్నాడు . కాని పరీక్ష దరఖాస్తు, టరమ్స్ ఫీజుల కోసం రాసినపైకం యింకా రాలేదు... కాలానికి యివేవీ తెలియక దొర్లుకుపోతోంది వడిగా

ఈవిషయాలే ఆలోచిస్తూ, కాలువ ఒడ్డున కూర్చున్న అరవిందాన్ని తెలుగు లెక్చరరు అనునయించాడు పరిస్థితులన్నీ తెలిసికొని, ఎంతయినా బాధపడ్డారు. ఎంతో అభిమానంతో, అరవిందాన్ని, ప్రిన్సిపాలు యింటికి తీసికొనివెళ్ళి హృదయముగా ఉన్నస్థితి చెప్పారు. ఆయనది సహజంగా జాలిగుండె. అరవిందం చరిత్రలో మంచులా కరిగింది. కాలేజీకి కట్టవలసిన పయికం ముందు ఫండులోంచి యిప్పిస్తానని, ఆతర్వాత స్కాలరుషిప్పుతప్పకుండా వచ్చేమార్గం చూస్తానని మాటయిస్తూ యిద్దరిని సాగనంపారు నిజంగా ఆయన హృదయం అంతటి దయార్ద్రం కాని హృదయాలు మంచివయినంతమాత్రంలో అన్నీ మంచిపనులే చెయ్యగలుగుతామా...జరిగిన పరిణామానికి అరవిందం ఎంతయినా సంతోషించాడు తన తండ్రికి భారం తగ్గింది. తనకి బెంగ వదిలింది మనస్సులో వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నాడు అరవిందం యితోధికంగా పరీక్షలకి చదువుతున్నాడు.

కాని విధి వేరొలాఉంటే, ఎవరేమి చెయ్యగలరు! పరీక్షలముందు ఫీజు కట్టవలసిన పేర్లలో తన పేరుకూడ జోడింపబడి ఉండటంచూసి స్తంభించిపోయాడు అరవిందం డబ్బు కట్టనివాళ్ళని పరీక్షకి పోనివ్వరనిరాసి ఉందా నోటీసులో ఉన్నపళంగా రెండువందల రూపాయిలు ఎక్కడినుంచి తెస్తాడు. ఒకసారి లెక్చరరుని కలుద్దామనుకున్నాడు. యిక ఆయనమాత్రం ఏమి చెయ్యగలరు తనని ప్రత్యేకంగా తీసికెళ్ళి స్కాలరుషిప్పు అర్థించారు. మాట యిప్పించారు . యింతకంటె ఎవరు ఏమి చెయ్యగలరు...ప్రిన్సిపాలుని కలవడంకూడ అరవిందానికి మనస్ఫూర్తిగయిష్టం లేదు...కాని మనసొప్పక...పరీక్ష యిక రెండురోజులుందనగా ప్రిన్సిపాలింటికి వెళ్ళాడు అరవిందం. అరవిందాన్ని చూడగానే ప్రిన్సిపాలు లేచివచ్చి ఆదరించాడు. . అరవిందాన్ని సూటిగా మొహంలోకి చూడలేకపోతున్నాడు ప్రిన్సిపాలు. అరవిందం ఎందుకువచ్చాడో తనకి తెలుసు. . కాని వ్యవహారం తనకి మించిపోయింది. తను చెయ్యికలిగింది యిక ఏమి లేదు. . చూడు.. అరవిందం ఎల్లాగయినా యీ రెండు వందలు కట్టెయ్యి నీమీది అభిమానంతోనే నీకు మాట యిచ్చాను కాని

(15-వ పేజీ చూడండి)

శ్రీ వంగల వేణుగోపాలాచార్య

# దరిద్రం

దరిద్రంవల్ల బాధపడతారే కాని దాని అర్థం ఏమిటో ఆలోచించినవారెందరుంటారు? ఆలోచిస్తే ఏమి తేల్తుంది? ప్రయోజనం?

రాత్రి ఒంటిగంటప్పుడు రమణ మంచంమీద లేచి కూర్చున్నాడు. మూడురోజులై తనకు దూరమైన నిద్ర కోసం ఇంతప్రయత్నం ఎన్నడూ చేయలేదు నిద్ర దానంతట అది ముంచుకు రావాలిగాని, దానికోసం ఇంత ప్రయత్నమేమిటనుకున్నాడు రమణ తనతోపాటు రెండురాత్రులు, ఎందుకో అర్థంకాకుండానే మేలుకొన్న కాంత - ఇప్పుడు అమాయకంగా, నిద్రపోతున్నది పాపం, కాంత! తన్ను పెళ్లిచేసుకొన్న రెండో రోజునుంచే, తన దరిద్రం పంచుకోవడం అలవాటు చేసుకొన్నది. ఈ దరిద్రంలో తను దాదాపు ఏడాదికిందట ఎందుకు పెళ్లి చేసుకున్నదీ తనకే అర్థంకాలేదు. ఈ దరిద్రానికి చాలనట్టుగా, మరో నెలాళ్లలో కాంత కనబోతున్నది!

తన్నుపట్టి పీడిస్తున్నది దరిద్రమనే పూర్తిగా నమ్మాడు రమణ. దరిద్రం కాకుంటే మరేమిటి? తనుపుట్టి పెరిగిన తన ఊరు - అది తన స్వస్థలంకాకపోయినా, అసలు తనకు స్వస్థలమంటూ లేకపోయినా - కనీసం- తన తెనుగుదేశం. తనూ తన కాంతా బతకటానికి నెలకో వందరూపాయలైనా ఇవ్వలేకపోయింది ఇవ్వతలచుకుంటే ఇచ్చిఉండేదని తప్పుపట్టగలిగిన రమణకు, ఈ దరిద్రం తనకే కాదనీ, తనదేశంలోనే కొన్ని లక్షల మందికికూడా తనదేశం ఇదే దరిద్ర్యాన్ని ప్రసాదించినదనీ చప్పునతట్టలేదు. కేవలం తను ఒక్కడే ఇంత అన్యాయానికి పాల్పడ్డాడని రమణ అనుకోవడంలో రమణ పొరపాటుపడిఉండవచ్చు - అయితే తనవంటి ప్రతీదరిద్రుడూ ఇదేపొరపాటుపడుతున్నాడనిమాత్రం రమణకు తట్టలేదు.

తనతండ్రి విషయంకూడా అంతంతమాత్రంలోనే ఉందని రమణ ఎప్పుడైతే గ్రహించాడో ఆనాడే. తనతండ్రిమీద రెండుజీవితాల భారమైనా తగ్గించాలని, పొట్టచేత్తోపట్టుకుని వెయ్యిమైళ్ళదూరం ప్రయాణంచేశాడు. తనవంటివాళ్ళు తన తండ్రిమీద ఇంకా ఆరుగురు ఆధారపడి ఉన్నారు. అయితే, తను గురించి అంతసులభంగా దరిద్రాన్ని తనతండ్రిగుర్తించినట్టుకనపడలేదు. దరిద్రం తాండవిస్తున్నదన్న విషయం గుర్తించకపోవటం మాట అటుంచి, మనం దరిద్రంతో - శ్లేష్మంలో పడ్డ ఈగల్లాగా కొట్టుకుంటున్నాం అన్న విషయం ఎవరూకూడా గుర్తించకుండా చేశాడు తండ్రి ఇందుకు రమణ తనతండ్రిని చాలా అభినందించుకున్నాడు తనలో ఇక తనంతటతానే ఈ యథార్థం గుర్తించటంవల్ల, తనకు జరిగిందేమీ కనిపించకపోగా, చింత ఎక్కువయింది

మూడురోజులై రమణ, దరిద్రంఅంటే యేమిటి అని చేసుకుంటున్న తర్జనభర్జనతో అతనికి నిద్రపట్టలేదు. రెండుపూటలూ కడుపునిండా తినటానికి తన ఆదాయం అనుమతించటంలేదు రాత్రులు తినేతిండి తనకు వొంటపట్టటంలేదని కాంతతో అబద్ధమాడి, మానేశాడు. కాంతకు ఇటువంటి సమయంలో అవసరమైనపళ్ళూ అవీ ఇస్తూఉండటంలో కొత్త అప్పుకూడా పెరిగింది అప్పంటూ పుట్టింది! అమాత్రం పరపతి - ఈ దరిద్రంలో - పుట్టించుకోవటం ఘనతకిందే ఎంచుకున్నాడు రమణ.

అమాంబాపతులన్నీ కలిపి, తన ఆదాయం నెలకు నూటయాభైరూపాయలలోనూ మూడోవంతు, తను కాపరముంటున్న ఒక్కగదికీ ఇవ్వాలి పోతే, నూరు రూపాయలతో, ఈ జీవితం లాగటం కష్టంతో కూడుకున్న పనిగానే తోస్తున్నది. అయితే, ఇంతకన్నా తక్కువజీతగాళ్లు, బంట్రోతులూ మొదలైనవారు, ఈ దరిద్రాన్ని ఎలా ఎదుర్కొంటున్నారో రమణకు అర్థంకాలేదు. చూస్తూచూస్తూ, వాళ్లు బతుకుతున్న పద్ధతిలో తను బతకలేడు. అదిఒక్కటే కారణం అనుకున్నాడు.

కాంత కదిలింది. కదలటమేమిటి! ముసుగుతొలగించి మెల్లగా తనవైపు చూసింది.

"మీరు నిద్రపోవటంలేదూ?" అన్నది కాంత

"నాకు నిద్రపట్టలేదు" అన్నాడు రమణ.

"పడుకోండీ అదేపడ్తుంది మీకెప్పుడూ ఒకటే ఆలోచన!" అన్నది కాంత

నిజం తనకెప్పుడూ ఒకటే ఆలోచన అన్నవిషయం కాంతకు తెలిసింది దరిద్రం గురించి, ఈ దరిద్రపు ఆలోచన దరిద్రం తీరితేగానిపోదు తనుఉన్న స్థితిలో ఇటువంటి దరిద్రంతీరే సాధనం కనపడటంలేదు.

"నాకు కొంచెం తోడుంటారా?" అన్నది కాంతలేచి.

"పద" అంటూ తనూలేచాడు రమణ

కాంత బయటకువెళ్లి తిరిగివచ్చి పడుకున్నది

"నాకు ఏమోమాదిరిగా ఉన్నదండీ" అన్నది కాంత కొత్త ఆయాసంతో.

"ఎలాఉంది?" అన్నాడు రమణ.

కాంత సమాధానమివ్వకుండా అటువైపుకు తిరిగి పడుకున్నది.

"నెప్పిగాఉందా?" అన్నాడు రమణ ఏదో అనుమానంతట్టి

"ఏమో!.. తెలీదు" అన్నది కాంత.

కాంతకు నెప్పులు ప్రారంభం కాదు కదా! తనదగ్గర ఒక అయిదురూపాయల కాగితంతప్ప వేరేమీలేదు ఇదేనా తెల్లవారగానే లేవనుకే సరిపోతుంది. ఇప్పుడు కాంతకు నిజంగానే నెప్పులారంభమవుతే, ఎవర్ని ముష్టెత్తేది? ఏంచేయాలి?

తినటానికితిండీ, జీవితంలో కావలసి కనీసపు అవసరాలూ లేకపోవటంకన్నా దరిద్రం ఇంకేముంటుందిమరి? దరిద్ర అనేక రూపాలలో ఉత్పత్తి అవుతూ టుంది. ఎంత వారికి అ త దరిద్రం. తను అన కొంటున్న దరిద్రంత కన్న హీనమైనస్థితిలో ఉండేవారికి స్వర్గంగా

శ్రీ పన్యాల రంగనాధరావు

తోచవచ్చు.

అన్ని తరగతులవారికీ దరిద్రంఅంటే ఒకే అర్థం తోచినప్పటికీ, ఒక్కొక్కరికి ఒక్కొక్కరూపంలో అది ప్రత్యక్షం కావటంలోనే ఉంది. మధ్యతరగతిలో కిందితరగతివారికి చెందిన రవణదరిద్రం పెద్దదరిద్రం కాకపోవచ్చు. కాని, ఇదే పెద్దదరిద్రమని రవణఊహించటానికీ, అది తీర్చుకోలేక మథనపడటానికీ రవణకున్న కొద్దిపాటి సంస్కారందోహదం చేసిందని చెప్పాలి దరిద్రాన్ని దరిద్రంగా గుర్తించుకోనడంలోనూ, అదితీర్చుకోటానికితగిన శక్తిలేకపోవడంలోనూ ఉంది చిక్కు. ఈ చిక్కు తీర్చుకోవాలంటే రవణకు ఎదురైన సాంఘికపరిస్థితులు అతనికి ఏమాత్రమూ సహాయంచేయకపోగా, రవణని మరింత దరిద్రుణ్ణిచేశాయి.

'డబ్బుతేలేనట్టి నరులకు కీర్తి సంపద లబ్బవోయ్' అన్నముక్క జ్ఞాపకమొచ్చింది రవణకి తనకు కీర్తి వద్దూ, సంపదావొద్దు అంతకన్నాముందు. కనీసపు కోరిక - తనవంటివారి ఈ దరిద్రానికి పరిష్కారం కనిపిస్తే అదే పదివేలు. కీర్తి సంపదల సిగతరిగిరి!

తను వేసుకున్న లెక్కప్రకారం కాకుండా, పదిహేనురోజులు ముందుగానే రవణకు దరిద్రం. ఒక కొత్త రూపంలో ప్రత్యక్షమయింది ఈసారి సుపుత్రుడి రూపంలో!

అయితే రవణ, దీన్ని, దరిద్రం తాలూకు ప్రత్యక్షావతారంగా భావించలేదు. తను ఒక తండ్రిఅయినాడన్న పితృభావం ఇందులో ఇమిడిఉన్న దరిద్రభావాన్ని అణిచివేసింది. ఆరోజున రవణ అనుభవించినంత ఆనందం ఎన్నడూ అనుభవించలేదు. ఆ ఆనందంతోనే, మూడోనాడు ఒక కార్డు సంపాదించి, తల్లికి ఉత్తరంరాశాడు

"మ. అ వ. అమ్మకి. నిన్న పదిహేనోతారీఖు తెల్లవారుఝామున-అంటే అయిదూ పదినిమిషాలకు నీకు ఇక్కడ ఆస్పత్రిలో మనుమడు కలిగాడు తల్లీ పిల్ల క్షేమం. ఈ శుభవార్త అందరికీ తెలియచేయవలసింది"

ఇది పోస్టుచేసిన సాయంకాలమే, తను తాత్కాలికంగా మరిచిన దరిద్రం రెట్టింపుతో మరో రూపంలో సాక్షాత్కరించింది రవణకి. ఈ దరిద్రం, తండ్రి రాసిన ఉత్తరంలో కనిపించింది

"—ఇవేళకి పదిహేను రోజులై మీ అమ్మ జబ్బుతో తీసుకొంటోంది. టానిక్ ఇరిగింజెక్షన్ అపకేసను అవసరమంటున్నారు. నువు పెద్దవాడివి. ఒకసారి వచ్చి, తల్లినిచూసి వెళ్తావా ?"

ఒక్కొక్కప్పుడు దరిద్రానికి సాటూత్తుగాకూడా ప్రత్యక్షమయ్యేశక్తి ఉంటుందని రవణ ఊహించలేకపోయినాడు. తను ఉన్నస్థితిలో, తక్షణం ఎట్లాప్రయాణం చేయటమో తెలీలేదు. కడసారి, తల్లిని ఒక్కపర్యాయం చూసుకోటానికి అవకాశంలేకపోవటం అన్నింటికన్న మించిన దరిద్రం

"నాన్నగారికి, కాంతకు పురుడువచ్చిందని నిన్ననే అమ్మకు రాశాను. ఈ పరిస్థితిలో దాన్ని వొదిలి ఎట్లారాగలనో అర్థంకాకుండాఉంది. అమ్మకు ఎలాఉన్నదీ వెంటనే రాయండి—"

తను రాలేనన్నవిషయం స్పష్టంగా రాయటానికి ఇంతకన్న చేతకాక, ఒక ఉత్తరంరాసి పోస్టుచేసి వొక్కడే తన గదిలో, దిండులో ముఖంపెట్టి, రవణ వెక్కివెక్కి ఏడవటం, భగవంతుడనేవాడుంటే, వాడికి వినపడిఉండాలి

ఆ దుఃఖంలోనే కాంతా, తన చిన్నకొడుకూ జ్ఞాపకంరాగా, రవణ వెంటనే లేచి, ఆస్పత్రి చేరుకొనేసరికి, అప్పటికే వేళమించిపోయి, గేట్లు మూసేశారు.

ఈసారి రవణకు దుఃఖం రాలేదు. ఆస్పత్రిఉన్నచోటమాత్రం, పెద్ద సముద్రం—సముద్రంమీద దరిద్రదేవత నాట్యంచేస్తున్నట్టూ కనిపించాయి. ★

# వ్యధితహృదయం

(13-వ పేజీ తరువాయి)

కమిటీ నాకు ఎదురుతిరిగింది ..నా మాట ఏదీ వాళ్ళకి నచ్చటంలేదు. .నేను చెయ్యగలిగిందేమీలేదు . యింకా ఏదో అంటున్నారు ప్రిన్సిపాలు. తరువాత మాట లేవీ అరవిందానికి వినిపించటంలేదు. కన్నీరు మాత్రం ధారలుగా చెక్కిళ్ళమీదుగా ప్రవహిస్తోంది మెల్లిగా వంగి ప్రిన్సిపాలు గారి కాళ్ళకి వందనంచేశాడు 'నా గురించి మీరు విచారించకండి—మీ హృదయం నాకు తెలుసు 'వస్తానంటూ సెలవు తీసికొని, భారంగా రూముకి చేరాడు

తన తండ్రివంకనుంచి ఆశలేదు యితర వ్యక్తుల నాశ్రయించడం అరవిందానికి యిష్టంలేదు

పరీక్ష మొదటిరోజున, తోటివిద్యార్థులందరూ పరీక్ష రాస్తుంటే, అన్ని సబ్జక్టులూ బాగా చదివిన అరవిందంమాత్రం ఊరి బయట ఏ మామిడితోపులోనో, కాలువ గట్టుమీదో ఆ కాశంలోకి శూన్యంగా మాస్తూ కూర్చునేవాడు మూడోరోజున గాబోలు ప్రిన్సిపాలు అరవిందానికి కబురంపాడు. 'డబ్బు విషయం తర్వాత చూసికోవచ్చు, పరీక్షకి రావలసిందని'. గాని అరవిందంలోని ఆత్మాభిమానం సమ్మతించలేదు అప్పటికే రెండు పరీక్షలయ్యాయి. ఫస్టుక్లాసు రావలసిన తనుపార్టు మిగులుతో పోవడమూ.. నిరుత్సాహంతో, ఆ సహాయం కూడ నిరాకరించి, రెండేళ్ళ చదువూ వ్యర్థం కాగా, కాలేజీలోంచి యివతలికి వచ్చేశాడు అరవిందం శాశ్వతంగా

యీవిషయం జరిగి యిప్పటికి రెండేళ్ళయింది యీ రెండేళ్లూ అరవిందం తండ్రివద్దే ఉన్నాడు తన చదువువిషయం తెలిసినదగ్గరినుంచీ ఎంతయినా యత్నించాడు డబ్బుకోసం, యింకా యిత్నిస్తూనే ఉన్నాడు కాని . ఆదాయానికి మూడింతలు ఖర్చున్న ఆ సంసారంలో అరవిందానికి ప్రత్యేకంగా రెండు వందలు రాలాలంటే అంత సులభంకాదు తనే కాలేజీకి డబ్బు కట్టవలసి రావడంతో తన స్కూల్ ఫయినల్ సర్టిఫికేటుకూడా కాలేజీలో చిక్కుపడింది యిప్పుడు తను చదివిన చదువుకి నిదర్శనం కూడ లేదు

పోనీ యిల్లువదిలి ఎటయినా పోయి సంపాదించుదామనుకున్నాడు అరవిందం. యింట్లో తనొకడే కొత్త అందుబాటులో ఉన్నాడు తను లేకపోతే వీళ్ళని ఎవరు కనిపెట్టి ఉంటారు సంపాదించిపెట్టినా పెట్టకపోయినా, ఉన్న నలుగురూ కళ్ళముందు తిరగాలని ఆశించే తలిదండ్రులని కాదనటం ఎలా'. పయిగా తనకి సర్టిఫికేట్లు లేవే... ఎక్కడికి వెడితే ఎవరు చూస్తారు తన మొహం తనకున్న చదువూ .. విజ్ఞానం ఆ ఒక్క కాగితం ముక్క లేకపోవడంతో తుడిచిపెట్టుకుపోయాయి. తనతోచదివి పాసుపోయినవాళ్లు యిప్పుడు బి ఏలు అయిపోతున్నారు. తనుమాత్రం ఎదుగూబొదుగూలేకుండా మొండిగా నిలబడిపోయాడు. ఇంత వెగటుజీవితంలోనూ, అరవిందం సారస్వతసేవ వదలలేదు. అతని గేయాలు ... రచనలూ .. పత్రికలూ . ప్రీతితో మన్నిస్తాయి. అదే అతనికి హృదయశాంతి కాని అదిక్షణికం. ఆ వ్యర్థపు చదువూ.. యీ నిరుద్యోగ జీవనమూ తలచుకుంటుంటే మనస్సు వికలమయిపోతూంది అరవిందానికి.

పాతికేళ్లు సమీపిస్తున్న అరవిందం, తండ్రి అండలో, తన శుభదినాలు కల్పించుకొని. ఆశిస్తూ.. ఎదురుచూస్తూ...గమ్యంలేని పథికుడిలా . జీవితం వెళ్లబుచ్చుతున్నాడు. 'యింకా తనలాంటి అభాగ్యులెంతమంది లోకంలో ఉన్నారో అనుకుంటూ' ! ★



ఉత్తరాలు వ్రాయగా వ్రాయగా వెళ్ళక తప్పిందికాదు చివరకు గోపీకి తన అత్తవారింటికి. నాలుగయిదు రోజు లెలాగో గడిపి వద్దామని ప్రయాణం కట్టాడు. అత్తవారింట్లో మర్యాదలు సక్రమంగానే జరిగినయి.

రెండుపూటలు కాఫీ ఫలహారాలతో ఆహ్లాదకరంగా అయిదు రోజులు గడిచినయి. అసలు గోపీ సెలవలకు తనవూరు రాగానే శ్రీమతిని పంపించవలసిందని మామగారిని కోరేడు. గోపి మామగారు పూర్వాచార పరాయణుడు. ప్రతి విషయంలో పంచాంగాన్ని పరిష్కరంగా స్వీకరిస్తాడు అయన యేవో సాకులు చెప్పి ఇప్పుడు కూతురని పంపడానికి వీలు లేదు, గోపినే వచ్చి పదిరోజులుండి పొమ్మని జవాబు వ్రాసేడు.

ఆరో రోజున మామగారితో తన తిరుగు ప్రయాణం ప్రస్తావన ఎత్తాడు.

"నేనింక వెళ్తాను. మీ అమ్మాయిని పంపించండి నే కాలేజీకి వెళ్ళేటప్పుడు దించి వెడతాను" అని అన్నాడు.

"అదేమిటోయి, వచ్చి నాలుగు రోజులన్నా కాలేదు, అప్పుడే పోతానంటావు? మేము మాత్రము యెప్పుడూ ఇక్కడే ఉండమంటామా? యేదో సెలవులకు వచ్చావు, ఈ పది రోజులు ఉండి పోగూడదా?" అని ప్రశ్నించాడు.

"లేదండీ? ఇంకా నాకు చాలా పనులున్నయి. రేపు తప్పకుండా వెళ్ళాల్సిందే" అని చెప్పాడు గోపీ మామగారితో.

మామకు గోపీ మూర్ఖపు పట్టుకు కొంచెం కష్టము వేసిన మాట నిజం తన మామగారు యేవో మూఢాభిప్రాయాలు పెట్టుకొని కూతురిని పంపడానికిది సమయంకాదని చెప్పినందుకు గోపీకి కొద్దిగా తన మామగారిమీద కోపం వచ్చిన మాట కూడా నిజమే.

"సరే అలాగే రేపు వెళుదుగాని లేవోయి!" అన్నాడు మామగారు.

**తిథి వర్జ్యాలదోషాలు చూసుకునే ప్రయాణమైనా తిప్పలు తప్పడంలేదు మరిదోషం ఎందులో ఉన్నట్టు?**

"మీ కూతురిని కూడా పంపించాలి" అన్నాడు గోపీ.

"అదెందుకోయి ఈ పది రోజుల భాగ్యానికి. నీవెలాగో వచ్చావు. చూసేవు తరువాత మంచి రోజు చూసి అమ్మాయిని పంపిస్తాములే" అన్నాడు మామగారు.

గోపీ మనసులో కించబడ్డాడు.

తన భార్యకే సూటిగా చెప్పేసేడు, "నీవెలాగయినా రావలసిందే" అని ఆమె చాలాసేపు చెప్పిచూసింది, తన తల్లిదండ్రులకప్పుడు తనని పంపించటము యిష్టం లేదని ముఖ్య కారణం తను క్రొత్తగా కాపురానికి రావడానికవి మంచిరోజులు కావని అత్తగారే కాకుండా ఇంకా యిద్దరు ముగ్గురు పెత్తనదారులు కూడా చెప్పి చూసేరు.

"అబ్బాయి ఇప్పుడమ్మాయిని పంపటమేం బాగుండదు అత్తవారింటికి క్రొత్తగా కాపురానికి వెళ్ళేటప్పుడు అశుభమూ శుభమూ చూసి మరీ పంపించాలని"

ససేమిరా గోపీ తన భార్య తనతో బయలుదేరాల్సిందే నన్నాడు. ఆరోజు సాయంకాలమే ప్రయాణం కావాలన్నాడు భార్యతో. ఆమెకు కూడా తల్లిదండ్రుల కిష్టము లేకుండా భర్తతో రావడానికి కుత రామూ ఇష్టంలేదు. కాని తను ప్రవేశించబోయే క్రొత్త జీవన ప్రారంభంలోనే భర్త కెదురాడడానికి ఆమె సాహసించలేదు.

ప్రయాణ ప్రయత్నాలు పూర్తి అయినయి మామగారు ఇంక ఎలాగూ ఆగడు అని పోనీ వర్జ్యమన్నా లేకుండా చూద్దాము ప్రయాణం సమయాని కనుకొని బండికి ఇంకో గంట వుందనగా పంచాంగం తిరగేసేడు. సరిగా రైలు బయలుదేరే వేళకు వర్జ్యంవుంది.

"అబ్బాయి యేదో పెద్దవాడిని చెవుతున్నాను. విను. ఈపూట వర్జ్యముంది ఈ పూటకు ప్రయాణమాపి రేపు వుదయం బయల్దేరుదుగాని" అని అన్నాడు.

"వర్జ్యం గిర్జ్యం. వర్జ్యమేమిటీ సింగినాదం"

"పట్టింపులేని వాళ్ళకి వర్జ్యమొక అడ్డుగాదు యెన్ని సార్లు రైలు ప్రయాణం చేసేమో. ప్రతిదఫా పంచాంగం చూసే ప్రయాణం చేస్తున్నామా? రైళ్లు రోజూ నడుస్తూనే వుంటయి గదా? రోజూ ఎప్పుడో ఒకప్పుడు వర్జ్యం వుంటూనే వుంటుందిగదా? ప్రయాణం చేసే వాళ్లు చేస్తూనే వున్నారు వాళ్లు శుభ్రంగా గమ్యస్థానం చేరుకొంటూనే వున్నారు. వర్జ్యంలో బయలుదేరిన రైళ్ళన్నీ పడిపోతున్నయ్యా? ఒకవేళ రైలుపడిన మన ప్రారబ్ధమే కాని వర్జ్య ప్రభావం కాదు. మాకేం భయంలేదు మళ్లీ రేపు చాలా పనులున్నయి ఈ పూటే వెళ్లనియ్యండి" అని చిన్న ఉపన్యాసం దంచాడు గోపీ

అత్తగారు, మామగారూ అనేక విధాల చెప్పి చూసేరు కాని గోపీ తన ప్రయాణం సాగిపోవాల్సిందే నన్నాడు.

జట్కాబండిలో గోపీ భార్యతో స్టేషను చేరుకున్నాడు. స్టేషను చేరగానే తెలిసింది బండి రెండు గంటలు లేటు అని. అంటే సాయంకాల మయిదింటికి కాని రైలు ఆ వూరికి చేరుకోదు.

గోపీ భార్య అంది "చూసేరా, వర్జ్యం వేళ మనం బయలుదేరిన ఫలితం"

"పిచ్చి అభిప్రాయాలు వదలిపెట్టు రైళ్లు ఎన్ని సార్లు ఆలస్యంగా రావడంలే? దాంట్లో ఈ రోజొకటి ఇప్పుడు ముంచుకు పోయిందేంలేదులే" అన్నాడు గోపీ.

# వర్జ్యం

## "శ్రీరాగి"

కాని గోపీ మనసులో యేదో ఒకమూల కొంచెం అనుమానముంది. వర్జ్యం సంగతి ఎత్తకే కూడదు. ఎత్తుతే అనుమానం అనుమానమేగదా. "అందుకు తగినట్లు అప్పుడే సూచనలు ఆరంభ మయినయి. కాని అప్పుడు మామగారింటికి తిరిగిపోతే తన ప్రతిష్ఠకు భంగం కాదూ! అక్కడికి భార్య జానకి అననే అంది-"యేమండీ, ఇప్పుడే నా యింటికి పోదాం పదండి ఈ రైలు ఎప్పుడు వస్తుందో ఏమో, మనం తెనాలి చేరుకొనే టప్పటికి యే రాత్రవుతుందో! ఎందుకొచ్చిన అవస్థ ఇది" అని.

కాని గోపి భార్య సలహాను త్రోసి పుచ్చాడు.

రెండు గంటలు లేటు అన్న రైలు స్టేషను రావటానికి మూడుగంటలు పట్టింది. తలుపులు పట్టుకొని వ్రేళ్లాడుతున్నారు జనం. మామూలుగా కొద్ది ఖాళీగానే వుంటుండేది రైలు మూడుగంటలు లేటు అవటంతో గంటలు గంటలు ఆలస్యంగా రైలుకు బయలుదేరిన వాళ్లుకూడా రైలు అందుకోటంతో రైల్లో ఒత్తిడి ఎక్కువయింది

రెండుగంటలు లేటు అనటంతో మామూలుగా తెరిచే బుక్కింగు ఆఫీసుకూడా తెరవలేదు. తీరా ప్రక్కస్టేషనులోకి రైలు వచ్చింది అనే వార్త చేరేటప్పటికి స్టేషనుమాస్టరు 'బుకింగుస్టాపు' అనే బోర్డు తగిలించాడు గోడమీద. అది చూడగానే గోపీ అనుమానం ప్రబలమయింది స్టేషనుకొచ్చిన ప్రయాణీకులందరూ నిస్పృహతో రైళ్లను తిట్టుకుంటూ ఇళ్లకు చేరుకుంటున్నారు.

గోపీ సంధిగ్ధావస్థలో పడ్డాడు. ఇప్పుడు ఇంటికి తిరిగి పోవడమా? లేక ప్రయాణం సాగించడమా? ప్రయాణం సాగించటానికి టిక్కెట్లెలా వస్తయి? టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయటం గోపీకి అలవాటు లేదు. అందులో పోనీ ఈసారెలాగయినా ధైర్యం చేద్దామా అంటే, తానొక్కడే గాదు. కూడా శ్రీమతి గూడా వుంది. ప్లాటుఫారంమీద పచార్లు చేస్తున్నాడు యేమీ ఆలోచన తేలక. టికెట్టు కలెక్టరు హడావుడిగా డ్యూటీకివస్తూ కనుపించాడు.

మెల్లిగా టికెట్టుకలెక్టరు దగ్గరికిచేరాడు.

"గుడీవెనింగుసార్" అన్నాడు టికెట్టు కలెక్టరుతో.

"గుడీవెనింగ్" అని 'వాట్ ఈస్ ది మాటర్' అని ప్రశ్నించాడు గోపీని టికెట్టు కలెక్టరు"

"యేం లేదండీ ప్రత్యేకంగా మా కోసమే ఈ రోజున బుక్కింగుస్టాప్ చేసి పట్టున్నారు."

'లేదండీ ట్రెయిన్లో రష్ ఎక్కువగా వుంది. అందుకే బుక్కింగు స్టాపు చేయమని వొచ్చింది.'

'మరేలాగండి. నేను అర్జంటుగా తెనాలి వెళ్లాలి. ఎలాగయినా రెండు ఇంటరు టిక్కెట్లిప్పించండి!"

"బుక్కింగుస్టాప్ చేయమని ఆర్డరు వచ్చిన తర్వాత టిక్కెట్లు ఇస్యూచేస్తే మాటొస్తుందండి. క్షమించండి"

"మీరలాగంటే యెట్లాగండీ. ఎట్లాగయినా ఏదో ఒకటి దారి చూడండి"

"పోనీ గార్డుతో చెప్పమంటారా! తెనాలిలో దిగేదాకా కనిపెట్టి ఉండమని"

"నాకు టికెట్టు లేకుండా ప్రయాణం చేయటం తగని భయము గార్డెక్కడో వుంటాడు. మధ్య దారిలో ఎవరు టిక్కెట్టడిగినా అసహ్యంగా ఉంటుంది"

"మరింకేం చెయ్యమంటారు? ఈ పూటకు ప్రయాణం మానుకోండి"

"ఈపూటే వెళ్లాలని కదండీ ఈ ప్రయత్నమంతా. ఏదో చూడండి" అని ప్రాధేయపడ్డాడు గోపీ.

రెండు రూపాయల నోటు టిక్కెట్టు కలెక్టరు చేతిలో పడిన తర్వాత, అతను

(38-వ పేజీ చూడండి)



భార్యను ట్రంకుపెట్టిమీద కూర్చోబెట్టి తాను నిలబడ్డాడు.

# క్రొత్తమాస్టారు

"ఇదేనండయ్యా! మీక్లాసు"

"సరే, ఆ అటెండెన్సు రిజిష్టరిటిచ్చి నువ్వికవెళ్లు" అని సాగనంపాడు క్రొత్తగాజేరిన యల్. టి. హనుమంతరావు తనకు తన తరగతిని చూపటానికివచ్చిన ఫ్యూను నరసయ్యతో ఫ్యూను ఆ రిజిష్టరిచ్చి క్రొత్తమాస్టారొచ్చేసరికి పిల్లలున్నారో లేదో అని క్లాసులోకి ఒక్కసారి తొంగిచూచి వెళ్లిపోయాడు

తమకు క్రొత్తమాస్టారు వస్తున్నారని అంతకుముందే పసికట్టిన ఆ క్లాసు విద్యార్థులంతా సిద్ధంగావున్నారు ఎప్పుడు మాస్టారు తమతరగతిలో అడుగు పెడతారా, ఎప్పుడు తామంతకుముందే నిర్ణయించుకున్న ప్రకారం వీలైనంత అధికంగా గోల చేసి ఆనందిద్దామాఅని. ఇంతలో మాస్టారు క్లాసులో అడుగుపెట్టటమూ 'అరె! క్రొత్తమాస్టారు' 'అరె! క్రొత్తమాస్టారు' అనే అరుపులూ, కూర్చున్న బల్లలనూ, ముందున్న డెస్కులనూ, వివిధరకవాయిద్యాలుగా వుపయోగించటమూ జరిగిపోయింది. ఆ మాస్టారుకూడా ఇదంతా ఇట్లాజరుగుతుందని ముందేపసికట్టినవారికి మల్లే ఏవిధమైన తొట్రుపాటు, చిరాకుచూపకుండానే వెళ్ళి గద్దెనెక్కి, తమ నియమితస్థానంలో కూర్చున్నారు.

తామనుకోనివిధంగా జరగటంవల్ల క్లాసంతా ఒక్క నిమిషం నిశ్శబ్దమైంది. ఇంతలోనే వెనకబల్లమీదబేడు బల్లపగులులో నుంచి వ్రేలితో మీటినశబ్దం 'బర్.. బర్.' మంది. దాంతో మళ్లా క్లాసు 'సైలెన్స్' 'సైలెన్స్' అనేఅరుపులతో నిండిపోయింది మరొక్క నిమిషం. అప్పటికీ మాస్టారి నోటినుండి ఒక్కమాటకూడా రాకపోయేసరికి చాలా ఆశ్చర్యపోయారు విద్యార్థులంతా క్రమంగా నిశ్శబ్దం దానంతటదే ఏర్పడింది "చెవిటేమోరా" అందింతలో ఒకగొంతు "మూగకూడా నేమోరా కొంప తీసి" అందిమరొకగొంతు "అయితే ముందుగా మూగభాష నేర్చుకొని మరీ రావాలేమోరా మన మీ క్లాసుకి, పాఠా

# జారు

లర్థంకావాలంటే" అన్నాడు మరొక విద్యార్థి. తన భాగానికి ఎక్కువమాటలు రావటంవల్ల చివరి విద్యార్థి బయటపడిపోయాడు. అయినా క్రొత్తమాస్టారేమీ అనకుండా అతనివంకచూసి చిరునవ్వు నవ్వారు

దాంతో అదిరిపోయారు విద్యార్థులంతా 'నిండుకుండ తొణక'దంటారు ఆ బాపతేనేమో ఇదికూడా ఉన్నట్టుండి పేకపట్టుకుంటాడేమో. అయినా ఈ క్రొత్తమనిషి తత్త్వం కొంతవరకు తెలిసేవరకైనా జాగ్రత్తగావుండాలి అని ఎవరికివారే — అంతా — నిర్ణయించుకొన్నారు

ఇక ఆ క్రొత్తమాస్టారి విషయంకూడా అట్లాగేవుంది. ఇదే ట్రెయినింగై క్రొత్తగా చేరటం. క్లాసును మెయిన్‌టెయిన్ చేయగలుగుతానో లేదోఅని. ఎట్లాగైనా మొదటి రోజునే కనుక క్లాసును లోబరచుకొని, పిల్లలకు తనమీద సదభిప్రాయంకలిగేటట్లు చూసుకుంటే ఇకముందు ఫరవాలేదు. కాబట్టి తనశక్తిసామర్థ్యాలన్నీ వుపయోగించి యేదోవిధంగా ఆరోజునే విద్యార్థుల్ని తనకులోబరచుకోవాలి.

ఆవిధంగా నిర్ణయించుకొన్న క్రొత్త మాస్టారు తరగతిలోని పిల్లల్నందర్నీ-వరుసగా-ఒక్కసారి నిదానంగా, చూచి అటెండెన్సు తెరిచారు. రెండుమూడుపేర్లు పిలిచారో లేదో.

"నెంబర్లు పిలవాలిసార్" అన్నాడు వెనుకనుంచి గోపాలం.

"పేర్లా పిలవచ్చోయ్" అన్నారు మాస్టారు

"మాకు మానెంబర్లు తెలుసుకదండీ" అన్నాడు మరొకవిద్యార్థి.

గోపాలానికి అండగావుంటుందని.

"అయితేమీకు మీపేర్లు తెలియవా?" అన్నారు మాస్టారు చిరునవ్వుతో

"మా మాస్టర్లందరూ నెంబర్లతోనే పిలుస్తారుసార్" అన్నాడుమళ్ళీ గోపాలమే యెట్లాగైనా తమమాటనెగ్గించుకొని మేష్టార్ని మొదటిరోజే తమకు లొంగదీసుకోవాలన్న వుద్దేశంతో

"కాని నేను పేర్లతోనే పిలుస్తాను" అన్నారు నిశ్చలంగా మొదటిరోజేపిల్లల్ని తనకులొంగదీసుకోవాలనే వుద్దేశంతో వున్న మాస్టారుకూడా

"నెంబర్లు పిలుస్తేనే జవాబిస్తాం" అంది అవ్యక్తకంఠ మొకటి వెనుకనుంచి చివరి వూపుగా.

"పేర్లు పిలుస్తే జవాబియ్యనివారెవరో బయటకువెళ్ళొచ్చు నా అభ్యంతరమేమీ లేదు" అని కానసాగి పేర్లు పిలవటంతో క్లాసులో కొద్దిగా అలజడికలిగిందిగాని మళ్ళీ అది దానంతటదే సర్దుకుంది మాట వరసకైతే అన్నారుగాని పేరుకు జవాబియ్యకుండా బయటకు నడచినవారెవరూ లేరు.

తనమాట క్రొత్తమాస్టారివద్ద మొదట్లోనే విఫలమైనందుకు గోపాలంకొద్దిగా బాధపడ్డాడు. అయినా 'అది అపజయం అంతిమ విజయానికి ఆదిసోపానం' అన్న నవీనసిద్ధాంతం తనపట్లే నిజమౌతుందేమో అన్న ఆశకొద్దీ మరొక అవకాశంకోసం ఎదురుచూడసాగాడు ఇంతలో మాస్టారు తాను తరువాత క్లాసునుంచీ లెక్కలు చెప్పటం ప్రారంభిస్తాననీ, ఆనాటికి మాత్రం చిన్న పరీక్షవుందనీచెప్పి యేవో నాలుగులెక్కలిచ్చారు. సరే, ఆపిరియడ్

(37-వ పేజీ చూడండి)

# అదృష్టహీనులు

(7-వ పేజీ తరువాయి)

అవీ గాలించాను. ఊహుఁ; అంతులేదు. ఇంతలోకే ఎక్కడకు చచ్చాడో మరి! ఆ ప్రాంతంలో ఎక్కడా కనపడకపోయే సరికి వాడిమీద విసుగూ, కోపంవచ్చింది అయినా మళ్ళీ హోటళ్లలో ఏమైనా దూరాడేమోనని పోయి చూశాను గోపాలమూ, యింకో పెద్ద మనిషీ ఎదురెదురుగా కూర్చొని మాట్లాడుకుంటూ వున్నారు నన్ను చూసి కూడా కదలని గోపాలం వాలకం చూస్తే నాకు అరికాలు మంట నెత్తి కెక్కింది. పదినిముషాల్లో ఆ పెద్దమనిషివద్ద శెలవు తీసుకుని వచ్చాడు ఏమిట్రా అంటే ఆ వచ్చిన పెద్దమనిషి అతని పెదనాయనవీ, చాలా అవసరమైన పనిమీద తనకోసమే వచ్చాడనీ చెప్పేడు. అంతగా ఆలస్యమైతే మరో బస్సులో పోవచ్చునులే అని ఆయన గారితో మాట్లాడుతూ వుండిపోయాడట గోపాలం తన ఆలస్యానికి క్షమాపణ చెప్పకపోగా ఏదో పెద్ద కారణం చెప్పేడు.

గోపాలాన్ని కాస్త తొందరచేసి గబగబా బస్సుదగ్గరకు పరుగెత్తుకొచ్చాను అనుకున్నంతా అయింది. బస్సు కాస్తా వెళ్ళిపోయింది. దాని చక్రాల తాలూకు గుర్తులుమాత్రం దుమ్ములో కొట్టుకొని వున్నయ్. ఇంక రెండో గంటకుకాని బస్సు లేదు. అంతసేపూ యీ బస్సు స్టాండ్ దుమ్ములో ఏం చేసేట్టు! గోపాలం మూలంగానేకదూ యింత జరిగింది! ఆ బస్సులోనే పడిపోతే ఓ గంటముందుగా గూటికి చేరడమేగాక చార్జీలు కూడా తప్పేవిగా! ఇప్పుడు జేబులో డబ్బు వదిలించుకోవాలాయె పాగా గోపాలానికి కూడా నేనే యిచ్చుకోవాలి. చేతిదమురు భాగోతం! ఈ శనిగాణ్ని ఎప్పుడు వెంటేసుకెళ్ళినా ఏదోఒకటి యిలానే జరుగుతూవుంటుంది

వాణ్ని చూస్తున్నకొద్దీ నాకు వళ్లు చీమలు పాకుతున్నట్టనిపిస్తూంది. మళ్ళీ వచ్చేబస్సులో సీటుకోసం ఎంత అవస్థ పడాలో ఏమో ఖర్మ! నిన్నటినుంచీ - గోపాలం పజిల్ పోగొట్టుకున్నందుకు - వాడిమీదవున్న సానుభూతి యీ విసుగుదలతో అసహ్యంగా మారింది.

నా వాలకం గమనించి వాడూ మూతి బిగించుకొని ముఖం ముటముట లాడించుకుంటున్నాడు. వాడి ముఖం చూస్తున్నకొద్దీ నాకు కంపరం పుట్టుకొస్తూంది అసలు తనిపోని యీ శనిగాణ్ని నే నెందుకు నెత్తికి ఎక్కించుకోవాలి? వాడికోసం నే నెందుకు దిగిరావాలి? ఎక్కి కూర్చున్న వాణ్ని హాయిగా కూర్చోనేలక? నాలాంటి అనవసరపు హడావుడిగాళ్ళకు అంతేకావాల్లే - అని గడ్డితిన్న బుద్ధిని మనసు మందలిస్తూంటే, మావూరి బస్సు రానేవచ్చింది.

జనం విరగదోసుకుంటూ ఎగబడ్డారు బస్సుపైకి ఆ తోపిడి చూస్తూంటే వీళ్లంతా కలిసి ఆ బస్సును కాస్తా విరగతొక్కుతారేమో ననిపించింది

ఎట్లాగో చచ్చీ చెడీ గోపాలం, నేనూ బస్సుఎక్కి కూర్చున్నాము ఆ తోపిడికి నా చేతిగడియారం గొలుసు కాస్తా తెగింది గోపాలం గ్లాస్కోలాల్చీ బుజం పైన కొద్దిగా పిగిలింది.

అదృష్టంకొద్దీ త్వరలోనే బస్సు బయలుదేరింది ఆ చినిగిపోయినలాల్చీ, గాలికి ఎగుర్తూవున్న వాడి రేగిపోయిన జుట్టూ, వాణ్ని; వాడి మొహాన్నీ చూస్తూంటే నాకు కడుపులో ఏదో దేవినట్టూ, గుండెల్లో ఏదో కెలికినట్టూ, అదోమాదిరిగా వుంది.

రోడ్డుమధ్య గతుకుల్లోపడి తరవేగంతో దూసుకుపోతున్న కారులో మాకు ఒళ్లు హూనమైపోతోంది హోరునవీస్తున్న చలిగాలికి రోడ్డుపక్క చింతచెట్లు తల లూపుతూవున్నయ్. ఆ గుడ్డివెన్నెల్లో కొండచిలువలా మెలికలు తిరిగి మత్తుగా వున్న ఆ రోడ్డుపైన రంయ్యిన పోతున్న మా కారు చక్రున మలుపుతిరిగి వంతెన ఎక్కుతూ, గర్-బర్ మని శబ్దంచేసి ఒక్క కుదుపుతో ఆగిపోయింది ఇంకా నయం! ఆ వూపుకు నాతల ఎదురుగా చువ్వకు తగలాల్సింది కొద్దిలో తప్పకొట్టి పరిపోయింది ముందు సీట్లల్లో కూర్చున్నవాళ్లంతా కంగారుగా అరుస్తూ, గబగబా కిందకు దిగారు ఆ పడ్డ బ్రేక్ కారుకు కాకుండా ప్రయాణీకుల గుండెలకే పడినట్లయింది. ఖర్మకాలి యిది కాస్తా యిక్కడ చెడిపోయి కూర్చుంటుందో ఏమో ననుకుంటూ నలుగురితో పాటు నేనూ దిగాను. నాతో పాటు గోపాలం కూడా దిగివచ్చాడు.

వంతెనకు ఎడంవైపున యినుపకమ్మీలూ సిమెంటు బ్లాకులూ చెల్లాచెదురుగా ఎగిరి

పోయినై. కొన్ని రోడ్డుమధ్య అడ్డదిడ్డంగా పడివున్నయ్ మిగతావి కాలవలో పడి వుంటయ్.

ఉరకలు వేస్తూ, నురుగులు కక్కుతూ ప్రవహిస్తున్న ఆ ప్రవాహం మధ్యలో— మునుగుతూ తేలుతూ, గుండ్రంగా అల్లిబిల్లిగా సుడులు తిరుగుతూ మెల్లిగా కొట్టుకుపోతూంది వొక బస్సు.

అలా కొట్టుకుపోతున్న కారు టాపుమీద, దాని కమ్మీలు పుచ్చుకొనీ—వొకటేమిటి చేతి కందిన ప్రతిదాన్ని ఆసరాగా పట్టుకొని—దానితో పాటు మునుగుతూ, తేలుతూ ఆడ - మగ, పిన్న - పెద్ద అంతా కలగా పులగంగా కలిసి కొట్టుకుపోతున్నారు భయంకరంగా తమ్ము కౌగిలించుకొంటున్న మృత్యువు వొడిలోనుంచి బయటపడటానికి వాళ్లు చేస్తూన్న ప్రయత్నాలు, కాలవకట్టమీదా, రోడ్డుమీదా నిలుచుని చూస్తూన్న మా హృదయాలను కదిలించివేశాయి.

గట్టు తెంచుకొంటుందేమో ననిపిస్తూ, వొడ్డును వొరుచుకుని ప్రవహిస్తున్న ఆ మహా ప్రవాహంలో పడి చావు బ్రతుకుల మధ్యలో మునుగుతూ తేలుతూ వున్న ఆ అదృష్టహీనులకు మేము చేయగలిగింది ఏమీ లేకపోయింది; నిస్సహాయులమై నిరాశతో వూరికే వెర్రిగా అరవడం ■ డడం మినహా.

అలా మునుగుతూ తేలుతూ, హృదయ విదారకంగా వాళ్లు చేస్తున్న హాహాకారాలు, ఆర్తనాదాలూ కాలవకట్టపైనున్న తుమ్మచెట్లను సహితం కదిలించివేస్తున్నయ్ వంతెనకట్టడంలోని నల్లరాళ్లు సయితం కరిగి ద్రవించి ఆ మహాప్రవాహంలో కలసిపోతున్నవా అనిపిస్తూంది! ఆ అదృష్టహీనుల ఆర్తనాదాలను తన హోరులో ముంచెత్తి వుప్పొంగిన వుత్సాహంతో వురవళ్లు పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తూంది కాలువ.

అలా కొట్టుకుపోతున్న కారు చూస్తూ కాలవకట్టనే నడుస్తున్న మాకుఅస్పష్టంగా వొక ఆర్తనాదం వినిపించింది అది చాలా పరిచయమైన గొంతులా వుంది

ప్రవాహంలో పడి కొట్టుకుపోతూన్న కారుటాపుపై జారుతూ, లేస్తూ వ్యక్తి తన కుడిచేత్తో దేన్నో పైకెత్తి పట్టుకొని పిచ్చిగా అరుస్తున్న వొకవ్యక్తి గుడ్డివెన్నెల్లో మసకమసగ్గా కన్పించాడు

"సుబ్బారావ్ ! సుబ్బారావ్ !!" రెండు చేతులూ పైకెత్తి వెర్రిగా అరిచాడు గోపాలం.

ఆ మహాప్రవాహంలోపడి సుడులు తిరుగుతూ పోతున్న కారుతోపాటు సుబ్బారావు; అతనితోపాటు అతని కుడిచేతిలో ఎనభైమూడు వేల రూపాయల నల్లని పర్సూ - అదృష్టం - మెల్లగా మునిగిపోయింది

నిండు ఆశలతో, తీరని కోర్కెలతో నాలుగోవంతు అయినా గడవని శేషజీవితమూ, అతని భవిష్యత్తూ, అదృష్టం, ప్రతిభ, సర్వస్వం ఆ నిండు ప్రవాహంలో మునిగిపోయినయ్ కాలవకట్టమీద వున్న నా శరీరం తుమ్మచెట్టులా కొయ్యబారిపోయింది శరీరంమీది రోమాలన్నీ తుమ్మముళ్లులా చురుకు చురుకున చర్మాన్ని పొడిచివేసినై ఎందుకో మృత్యువుకు జీవితం అంటే అంత కసి ?

అట్లా మునిగిపోతున్న బస్సును చూస్తూ వుంటే, ఆ వెనకసీట్లో నేను కూర్చున్నట్టూ, మునిగిపోతూవున్నట్టే అనిపించి ప్రాణం వుక్కిరిబిక్కిరయింది అలా కాలువ కట్టమీద నుంచుని, బ్రతికుండీ చచ్చినట్టు వూహించుకుంటుంటే, శరీరం చల్లబడిపోయింది. గుండెలు బరువుగా, మెదడంతా జావగా, మనసంతా అయోమయంగా దేనికదే విడిపోతున్నట్టు అనిపించింది. బ్రతికుండీ చావడం అంటే ఏమిటో ఆరోజు మొదటిసారిగాఅర్థమైంది. జీవితానికి చావంటే అంత భయం ఎందుకో ?

చినిగిపోయిన లాల్చీతో, రేగిపోయిన చింపిరి జుట్టుతో - తెల్లని వెన్నెల్లో నిండుగా ఏమీ ఎరగనట్టే అమాయకంగా ప్రవహిస్తూన్న కాలువలోకి - నిర్వికారంగా, నిశ్చలంగా చూస్తున్న గోపాలాన్ని గట్టిగా కావలించుకొని హృదయానికి హత్తుకొన్నాను.

"గోపీ ! ఎంత అదృష్టవంతుడివిరా ! నాకు ప్రాణదానం చేశావ్; నీ ఋణం ఎలా తీర్చుకోగలనురా" ఎలా అన్నానో, యింకేమన్నానో నాకే తెలియదు.

మునిగిపోయిన బస్సూ, అందులోని జీవితాల తాలూకు అలలూ వొడ్డుకు చేరుకున్నయ్ గోపాలం నేనూ, సుబ్బారావు మునిగిపోయిన చోటును ఆఖరుసారి చూసి రోడ్డుమీదకు వచ్చాము

ఇంకా రెండుమూడు బస్సులూ, బళ్లూ, జనంతో రోడ్డుఅంతా కిటకిటలాడిపోతూంది గుంపులు గుంపులుగా చేరి ఎవరికి తోచింది వాళ్లు చెప్పుకుంటున్నారు ఆ ప్రమాదానికి కారణాన్ని తలోరకంగా వూహించి చెప్తున్నారు

ఏది ఏమైనా, ఆ పడిన బస్సు తమది కానందుకూ, ఆ పద్దానో తాము లేనందుకూ, ఎవరిమట్టుకు వాళ్లు వాళ్ళ అదృష్టాన్ని పొగుడుకుంటున్నారు మనస్సులో తెచ్చిన వేళావిశేషాన్ని గురించీ, పొద్దున్నే లేవగానే చూసిన ముఖాలను తలుచుకుంటున్నారు కొంతమంది

ఇంతలోకే జనం మధ్యలోంచి తోసుకుంటూ కళ్లజోడు సర్దుకుంటూ, మావైపే వస్తూన్న సుబ్రహ్మణ్యాన్ని చూసేసరికి

నాకు గుండెలు జారిపోయినై గోపాలం నిలువుగుడ్లు వేశాడు సుబ్బారావుతోపాటు కొట్టుకుపోయిన సుబ్రహ్మణ్యం బతికి ఎలా వస్తున్నాడో అర్థంకాక మేమిద్దరం నోళ్లు తెరుచుని అతన్ని ఆశ్చర్యంతో చూశాం. ఈసారి నాకు చచ్చిపోయినవాడు బ్రతికి వస్తే ఎలా వుంటుందో అర్థమైంది!

మమ్మల్ని చూడగానే, మాకు మించిన ఆశ్చర్యంలో మునిగిపోయాడు సుబ్రహ్మణ్యం ఒక్క పరుగున వచ్చి మా యిద్దర్నీ ఆప్యాయంగా వాటేసుకుని "మీ రిద్దరూ ఎలా బతికి బయటపడ్డార్రా!" అన్నాడు

ఐదు నిముషాలపాటు మేము ముగ్గురం సజీవులమైనందుకు సంతోషంతోనూ, ప్రాణస్నేహితుని దుర్మరణానికి విచారంలోనూ మునిగి వుక్కిరిబిక్కిరయినాము.

తర్వాత సుబ్బారావు వచ్చిన బస్సులో మేము రాలేదనీ, రెండో బస్సులో వచ్చామనీ సంగతంతా వివరంగా చెప్పాను.

బస్సులు బయలుదేరే సమయానికి వొక సబ్ యినస్పెక్టరు వస్తే ముందుసీటు ఖాళీ చేయాల్సి వచ్చిందనీ, అతనికి సీటుయిచ్చి తను దిగి వూళ్లోకెళ్లి వచ్చేసరికి రెండో బస్సుకూడా అందక మూడో బస్సులో యిప్పుడే వచ్చాననీ సుబ్రహ్మణ్యం చెప్పాడు

"ఇక్కడికి రాగానే మీరు ఎక్కివచ్చిన బస్సు కాలవలోకి బోల్తా కొటిందని తెలిసింది, ఇంకా నయం మీ రిద్దరూకూడా అందులోనే వున్నారనుకున్నాను" అన్నాడు సుబ్రహ్మణ్యం - విచారం అడుగున మిగిలివున్న సంతోషంతో.

ప్రయాణీకులంతా ఎవరు ఎక్కివచ్చిన బస్సుల్లో వాళ్లు ఎక్కుతున్నారు మా బస్సు కూడా బయలుదేరే ప్రయత్నంలో వుంది

"అరే! బస్సు పోతోంది వెళ్దాం పదండీ!" అని సుబ్రహ్మణ్యం దోవ తీశాడు తనెక్కి వచ్చిన కారు దగ్గరకు

కాని, నాకు ఎందుకో మళ్లీ బస్సులో ఎక్కడానికి మనస్కరించలేదు దాదాపు వూరు దగ్గరకు వచ్చాం ఓ మైలున్నర నడిస్తే యింటికి చేరుకుంటాము ఈమాత్రం భాగ్యానికి మళ్లీ ఆ మాయదారి బస్సులు ఎక్కాలా? ఆ మాటా యీ మాటా చెప్పుకుంటూ నడిచివెళ్దా మనిపించింది సరిగ్గా నా మనసులో వున్నది గ్రహించినట్టే అన్నాడు గోపాలం

"ఈ కాస్త దూరం నడిచి వెళ్దాం పదండీ!"

"నేనూ అదే అనుకుంటున్నాను. యీ భాగ్యానికి మళ్లీ బస్సు ఏమెక్కుతాంలే పదండి సుబ్రహ్మణ్యం గారూ!" నడవటానికి సంకోచిస్తున్న అతన్ని చూసి అన్నాను.

సుబ్రహ్మణ్యం, నన్నూ గోపాలాన్నీ ఎగాదిగా చూసి, మా హృదయాల్లో వున్న దాన్ని గ్రహించినట్టు సన్నగా నవ్వి "సరే పదండి!" అన్నాడు

ముగ్గురమూ కలసి ఆనాటి సంఘటన గురించి మాట్లాడుకుంటూ, ఆప్తమిత్రుని అకాల మరణానికి చింతిస్తూ బరువెక్కిన హృదయాల్తో నీరసించిన శరీరాలతో రోడ్డు మీద నడుస్తున్నాం. మా వెనుక బయలుదేరిన కార్లూ, బస్సూ కొక్కొక్కటే మమ్మల్ని దాటేసి వెళ్ళిపోయినై

నాకు జరిగిందంతా వో పెద్ద పీడ కల లాగా వుంది గోపాలం బంధువు దేవుడల్లే వచ్చి మా ప్రాణాలు కాపాడేడు గోపాలాన్ని ఆయనగారు ఆ హోటల్లో అంత సేపు ఆపబట్టే కదా యీ ప్రమాదంనుంచి మేము తప్పుకోగలిగింది ఇంతకీ మాకు భూమ్మీద గింజలున్నయ్ కాబోలు! గోపాలానికి సిగరెట్ తాగాలని బుద్ధిపుట్టి కారు దిగిపోవడం, అంతలోకే ఆయన గారు కన్పించి వాణ్ని ఆపడమూ, వాణ్ని పిలుచుకురావాలని నాకు బుద్ధి పుట్టించే తడవుగా కారు దిగి వెళ్లడమూ, తిరిగొచ్చేసరికి కారు కాస్తా వెళ్ళిపోవడం తల్చుకుంటే—అంతా విధివిలాసంగా వుంది!

స్నేహితుని దుర్మరణంవల్ల కలిగిన తీరని బాధతో బరువెక్కి క్రుంగిపోతున్న హృదయం—భయంకరమైన ఆ ప్రమాదం నుంచి అదృష్టవశాత్తు మేమైనా తప్పించుకోగలిగా మన్న భావన కలిగినప్పుడు—కొంత తేలిక పడ్తూంది ముందు గోపాలం, తర్వాత సుబ్రహ్మణ్యం, ఆ వెనుక నేనూ బరువెక్కిన తలలు కిందకు వంచి నడుస్తున్నాం

"ఇంతకీ మనం ముగ్గురం అదృష్టవంతులం!" సుబ్రహ్మణ్యాన్ని చూస్తూ అన్నాను

"అదృష్టమూ లేదు దురదృష్టమూ లేదు. సంఘటనలు వొకో సమయంలో అలా తటస్థపడుతూవుంటయ్," గంభీరంగా అన్నాడు సుబ్రహ్మణ్యం

"అలా అనకండీ! విధి బలీయమైంది. నుదుటిరాతను ఎవ్వరూ తప్పించలేరు"

"రాతా లేదు గీతా లేదు రాసిపెట్టినట్టు మనం చేయడం లేదు మనం చేస్తున్నదాన్నే ఎవరో ఎక్కడో రాసివుంచినట్టు మనం వూహించుకుంటున్నాం అంతే."

"అట్లా అంటే, గోపాలానికి రావాల్సిన ప్రైజ్ సుబ్బారావుకు రావడమేమిటీ, సుబ్బారావు లక్షరూపాయల ఆస్తితో సహా అలా బలవన్మరణం పొందడమేమిటీ? అతనితోపాటు ప్రయాణంచేసిన మనం బ్రతకడం ఏమిటి; అంతా విధి విహితం కాకపోతే? నిన్నటిరోజున సుబ్బారావంత అదృష్టవంతుడు లేడు, యీరోజు అతనంత దురదృష్టవంతుడూ లేడు క్షణంలో వచ్చేది తెలియదు కదా?"

"ప్రపంచంలో జరిగే ప్రతిసంఘటననూ సరిగా అర్థం చేసుకోలేక, దానికి అదృష్టాన్ని, దురదృష్టాన్ని ఆపాదించుకొంటాము మనం ఎదుర్కొని సాధించలేని కష్టాల్ని, బాధల్ని, పూర్వజన్మ పాప

ఫలితంగానూ, కర్మకిందనూ తోసేస్తాం. పరిస్థితుల వత్తిడికి లొంగిపోయిన వ్యక్తులు వాటిని తేలిగ్గా ఒప్పుకుని, తన అసమర్థతకు మరేదో కారణాన్ని వూహించుకుని వాటికి మానవాతీతమైన శక్తిని ఆపాదించి ఆత్మసంతృప్తిపడ్తారు."

'ఫెళ-ఫెళా'మని వురిమి ఉత్తర దిశను ఒక మెరుపు మెరిసింది! ఆ ధ్వనికి గుండెలు కరుచుకుపోయినై. సుబ్రహ్మణ్యం చెప్తున్నది ఆపి నడక వేగం హెచ్చించాడు. కారుమేఘాలు ఆకాశమంతా అలుముకొన్నాయ్. చల్లటిగాలి హోరు పెడ్తూ చీకటి మబ్బుల్ని ఉత్తరపు దిక్కునుంచీ వూరిమీదకు తరుముకు వస్తాంది. సన్నగా తుంపర పడసాగింది. మేము త్వరత్వరగా నడుస్తున్నాం.

మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు సుబ్రహ్మణ్యం; అతని కంఠంలోని నిశ్చలత, స్పష్టత నా హృదయంలో కొన్నో మాటి చలనం కలిగిస్తాంది.

"ఇదుగో! చూడండీ! ఒడుదుడుకుల సమాజంలో, కృత్రిమ సంబంధాల్తో పెనవేసుకుపోయిన సాంఘిక వ్యవస్థలో, అందరికీ సమానావకాశాలు, ముందుకు పోయే పరిస్థితులూ వుండవ్. కొన్ని సందర్భాల్లో చేయగలిగిన పనిని కూడా చేసే అవకాశం వుండదు. అవకాశాలనేవి చాలా అరుదుగా వస్తావుంటయ్ అదీ చాలా తక్కువమందికే అందులోనూ చాలామంది వాటిని జారవిడుచుకుంటారు అవకాశం అనేది కరవేగంతో వస్తుంది. మునికాళ్ళమీదే నుంచుంటుంది. ఒకోసారి దాన్ని నువ్వు గుర్తించేలోగానే అది పోతుంది. కొంతమంది అసలు తమకు అవకాశమనేది వచ్చిపోయిందనేది కూడా జీవితాంతంవరకూ గ్రహించలేరు కదాచిత్ గా వచ్చిన ఆ అవకాశాల్ని కొంతమందే ఉపయోగించుకోగలరు. దాన్నే లోకం అదృష్టం అని పిలుస్తుంది. మానవుని ప్రయత్నానికి పరిస్థితులు అనుకూలించితే అతణ్ని అదృష్టవంతుడు అంటుంది ప్రపంచం. ప్రతికూలించితే దురదృష్టవంతుడు అంటుంది అదే లోకం."
అని ఆయనగారు చెప్పుకుపోతుంటే—

"వూఁ" అని గట్టిగా నిట్టూర్చాను.

"తొరగా నడవాలి; లేకపోతే బట్టలు తడిసిపోతయ్!" అని హెచ్చరించాడు గోపాలం వాడు మా సంభాషణలో అంతగా మనసు పోనిచ్చినట్టులేదు.

వ్యక్తి ప్రయత్నం లేకుండానే వచ్చే అదృష్టానికీ దురదృష్టానికీ మీరేమంటారు?" అన్నాను. సుబ్రహ్మణ్యం మళ్ళీ అందుకున్నాడు—

"మీరన్నది సాకర్థమైంది. సుబ్బారావుకు అంత సంపద వచ్చిందంటే, పజిల్ బోర్డువాళ్ళు రెండుమూడు లక్షలమంది దగ్గర ఒక్కొక్క రూపాయిచొప్పున వసూలుచేసి, ఒకళ్ళకో యిద్దరకో ఫస్టు, సెకండ్ ప్రైజులపేరుతో కట్టబెడ్తారు. ఆ ఒకటీ, రెండూ బహుమతులు ఎవరికో ఒకరికి రావాల్సిందేకదా! అది తటస్థపడ్డవాళ్ళకు మాత్రమే వస్తుంది. ఈ పజిల్ కాంపిటీషన్ నిషేధిస్తే ఆ అదృష్టం సమస్యే అసలు వుండదు.

"ఇక కారుప్రమాదం సంగతంటారా! అది ఎంత పాత డొక్కు మీరు చూశారు కదా! అంతవేగంలో మలుపు తిరిగేటప్పుడు, ఆ స్టీరింగ్ కాస్తా వూడి డ్రైవర్ చేతిలోకి రావొచ్చు. లేకపోతే డ్రైవర్‌కి రాష్ డ్రైవింగ్ కావొచ్చు! ఏమైనా, అలాంటి అవకతవక కార్లూ, అశ్రద్ధ డ్రైవర్లూ వున్నంతకాలమూ యిలాంటి ప్రమాదాలు జరిగే అవకాశం యెప్పుడూ వుంటుంది."

"ఏమో నండీ! మీరెంత చెప్పినా..."

"చెప్పడం కాదండీ! చూడండీ - రోడ్డుమీద నడుస్తూంటే ఎదురు దెబ్బ కొట్టుకునేందుకు అవకాశముంది. అలాగే కాలవగట్టున నడుస్తూంటే తుమ్మముల్లు గుచ్చుకోవచ్చు. కాని చింతచెట్టు కింద తుమ్మముల్లు గుచ్చుకునే అవకాశాలు చాలా తక్కువగా వుంటయ్‌గదూ—" అని సుబ్రహ్మణ్యం చెప్పుకుపోతూండగానే, అంతవరకూ మౌనంగా నడుస్తూన్న గోపాలం—"అమ్మో!" అంటూ ఒక్కసారి వెర్రిఅరపు అరిచి ఎగిరి దూకి నడిరోడ్డుమీద వెల్లికిలా పడిపోయాడు.

మేమిద్దరం నిశ్చేష్టులమయిపోయి రోడ్డుమీద అలానే నుంచున్నాము. కళ్ళు జిగేల్ మనేట్టుగా ఆకాశం కోసారి మెరిసింది! ఆ మెరుపులో—మిలమిలా మెరుస్తూ, రోడ్డు కడ్డంగా జరజరా పాకిపోయింది కారెడు పొడుగు గోధుమవన్నె తాచుపాము.

"అయ్యో! గోపీ!" అంటూ ఒక్కకేక వేసి గోపాలం దగ్గర వాలిపోయాను.

రోడ్డుమీద పడి మెలికలు తిరిగిపోతున్న గోపాలాన్ని చెరో రెక్క పట్టుకుని లేవదీశాం. తలవైపు సుబ్రహ్మణ్యం, కాళ్ళవైపు నేనూ ఆప్తమిత్రుణ్ని మోస్తూ బరువెక్కిన గుండెల్తో ఆయాసపడుతూ ఎగశ్వాసదిగశ్వాసలతో కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిలో రోడ్డుమీద తొరతొరగా తడబడుతున్న అడుగులతో నడుస్తున్నాము అదృష్టహీనుడి గోపాలం నోటినుంచి తెల్లటి నురుగు కారుతోంది.

గాలివాన ఎక్కువైంది. చండప్రచం

డంగా వీస్తున్న వాయుదేవుని ధాటికి వోర్చలేక చెట్లు వేళ్లతోసహా వూగిపోతున్నయ్. రోడ్డుప్రక్కన ప్రవహిస్తూన్న వాగు ఘోష, దూరాన కృష్ణానదిరొద, గాలి హోరూ- మధ్యమధ్య మేఘాలగర్జన, కళ్లు మిరుమిట్లుగొలిపే మెరుపులూ, వెంటనే గాఢాంధకారమూ - వాటితో వాతావరణమంతా నిండిపోయింది.

అయ్యో! ఎంతఘోరం జరిగిపోయింది! సుబ్బారావు అలా దుర్మరణానికి గురికావడమూ, గోపాలాన్ని పాము కరవడమూ, గాలీ, వానా, చీకటిలో బిక్కు బిక్కుమంటూ గోపాలాన్ని మోసుకుంటూ పోవడమూ, అన్నీ కలిసి నా హృదయాన్ని వికలం చేసినై నా వీపునవున్న అదృష్టహీనుని కాళ్లు గిలగిలా కొట్టుకున్నయ్.

"గోపాలం కాళ్లకు బూటు వుంటే యీ ప్రమాదం జరిగివుండేది కాదేమో?" సుబ్రహ్మణ్యం ఎలా అనగలిగాడో అతనికే తెలియాలి ఆ పరిస్థితుల్లోకూడా అతనిలోని హేతువాదనా శక్తి చావలేదు తార్కిక సిద్ధాంతాలమీది నమ్మకం ఇంకా అతని మెదడును అంటిపెట్టుకుని వుండడం చూస్తే అతను సామాన్యుడుగా తోచలేదు

గోపాలం శరీరాన్ని కుడిభుజంపైనుంచి ఎడంభుజంమీదికి మార్చుకుంటూ సుబ్రహ్మణ్యం మళ్ళీ ఏదో అన్నాడు. అతని మాటలు నా చెవుల్లో దూరలేదు దూరినా, నా మెదడు వాటిని అర్థంచేసుకునే స్థితిలో లేదు. సుబ్రహ్మణ్యం కాలి బూట్ల ధ్వనిమాత్రం నా హృదయంలో నాట్యం చేస్తున్నది.

అతని గుండె రక్తమాంసాలతో కాక నల్లరాతితో చేయబడిందేమో ననిపించింది

కడవపోతగా వర్షం పడుతూంది మామీద ఆ బరువు లేకపోతే గాల్లో కొట్టుకుపోతామేమో నన్నంత విసురుగా గాలి వీస్తూంది ముందున్న సుబ్రహ్మణ్యం, అతనితోపాటు నేనూ వేగం హెచ్చించాము చలికి దవడలు గజగజా వణికిపోతున్నాయ్. పైనున్న గోపాలం శరీరం మంచుగడ్డలా తగులుతూంది.

ఢళ, ఢళా మని బ్రహ్మాండం పగిలిపోయినంత శబ్దంతో కళ్ళు చిరతలాకేటంత వెలుగూ.. ఆ వెలుగులో గిరగిరా తిరుగుతూ సూటిగా మీదకు వస్తూన్న వో పెద్దచెట్టు కొమ్మా, తడిసిపోయిన సుబ్రహ్మణ్యం పెద్దతలా, వాలిపోతూన్న గోపాలం ముఖమూ — ఆ దృశ్యం చివరిసారిగా నాకళ్లు చూడగలిగింది.

తర్వాత కళ్ళల్లో ఎర్రటిమంటలూ, చెవుల్లో ఖుయ్ మని ధ్వనీ, అంతా అయోమయంగా, లోతు తెలియని అగాధంలోకి జారిపోయినట్టూ అయింది

*　　*　　*

అలా స్పృహ తప్పి ఆ స్థితిలో ఎంతసేపున్నానో తెలియదు కొంతసేపటికి తెలివి వచ్చింది. కళావిహీనమైన చంద్రుడు పశ్చిమాన దూరంగా కన్పడుతున్న కొండల చాటుకు పోతున్నాడు ధృవనక్షత్రం ఉత్తరాన ఆకాశంలో మిణుకు మిణుకు మంటూంది. నా ముఖంపైన, శరీరంమీద వున్న కొమ్మల్ని ఆకుల్ని తోసేసుకుని పక్కవాటుగా లేచి కూర్చున్నాను. రెమ్మలతో, కొమ్మలతో కప్పివేయబడి నా ముందువైపు సుబ్రహ్మణ్యం, ఎడంపక్క గోపాలం పడివున్నారు సుబ్రహ్మణ్యం తల్లోంచి కారి గడ్డకట్టుకుపోయి ఎర్రటి రక్తం తెల్లటి వెన్నెలకు రంగులు కలుపుతూంది పగిలిపోయిన అతని కళ్ళజోడు యింకా వొక చెవిపక్కన వ్రేలాడుతూనే వుంది నల్లగా మాడిపోయిన గోపాలం ముఖంమీద తెల్లటి నురుగు గడ్డకట్టుకుపోయి చారలు కన్పిస్తూవున్నయ్

వాళ్ళను ఆ కొమ్మల మధ్యనుండి బయటికి లాగాలని లేచి నుంచోబోయాను కాని, నా ఎడంకాలు నా స్వాధీనంలో లేదు బలవంతంగా లాక్కొబోయే సరికి తొంటిదగ్గర యమబాధ కలిగింది. గట్టిగా అరవాలని ప్రయత్నించాను కాని, గొంతు పెగిలి మాట రాలేదు. పెద్దగా ఏడవాలనుకున్నాను. కాని, కళ్ళవెంట నీళ్లు రాలేదు.

అలాగే దేకుంటూ పోయి సుబ్రహ్మణ్యం ముఖంమీద వున్న ఆకు అలంతొలగించాను గోపాలాన్ని దగ్గరగా తీసుకున్నాను. ఆ యిద్దరితలలు నా వొళ్ళో వుంచుకొన్నాను

జీవితంలో ఏన్నో సాధించాలని వాళ్లు చేసిన ప్రయత్నాలూ, కోరిన కోర్కెలూ, వూహించిన వూహాలూ, కన్న కలలూ అన్నీ గాలిలో కలిసిపోవాల్సిందేనా?

మృత్యువు ఎంత క్రూరమైనదో అంత నీచమైంది. సృష్టినీ - జీవితాన్నీ అంతమొందించలేక వోడిపోయిన మృత్యువు అక్కసుకొద్దీ ఎంత నీచంగా ప్రవర్తిస్తుంది? వోడిపోయిన మృత్యువు దొంగచాటున పొంచివుండి అదృష్టహీనుల్ని వెన్నుపోటు పొడిచి, అకాలమరణానికి గురిచేసి తన కసి తీర్చుకుంటుంది!

పాతిక సంవత్సరాలైనా నిండని ముగ్గుర్ని పొట్టన పెట్టుకొన్నా, ఆకలితీరని మృత్యువు చెట్లనీడల్లో పొంచినట్లు తోచింది.

నా గుండెలు బరువెక్కిపోతున్నాయ్. నవనాడులూ విచ్చిపోతున్నాయ్ తొంటియెముకలో కలిగినబాధ గుండెల్లోకి పాకిపోతూంది ఆ నరకబాధకు నా యెముకలోని మూలుగుతో కదిలిపోతున్నాయ్. రక్తనాళాలు పగిలిపోతున్నాయ్. రక్తమంతా నీరవుతున్నట్టుంది. మూసుకుపోతున్న నా కళ్లనుండి జారిన రక్తాశ్రువులు, నా వొడిలో వున్న అదృష్టహీనుల ఫాలభాగంపై టప్ టప్ మని రాలినై చావు బతుకులసంధ్యలో ఆఖరిసారిగా తొణికిన ఆ వెచ్చటి కన్నీళ్లు, బ్రతికున్న వాళ్లవద్దనుంచి చనిపోయినవాళ్లకేదో జీవిత రహస్యాన్ని అందచేసినై

బలవంతంగా మూసుకుపోతున్న నా కళ్లలో—నీటిలో మునిగిపోతున్న నిండు బన్నూ, పడగ విప్పి నాట్యం చేస్తున్న నాగుపామూ, విరిగి పడిపోతున్న చెట్టుకొమ్మా, వాటి వెనక తెరచి వుంచిన మృత్యువు నోటిలోని చీకటీ—కన్పించినయ్.



# బొమ్మరిల్లు



## ★ తుమ్మెద పెండ్లి ★

శ్రీ కవిరావు

కమ్మని వసంత కాలములో
తుమ్మెద కన్నియ పెండ్లంట;
రావలసిన వారొచ్చారు,
తేవలసినయవి తెచ్చారు.

పోకుల గులాబి వచ్చింది,
రేకుల కోకలు తెచ్చింది.
మల్లీకుమారి వచ్చింది,
చల్లని వాసన తెచ్చింది.

అప్పుడె విచ్చిన కలువమ్మ
పుప్పొడి గంధము తెచ్చింది.
ముసుగుతీసి మందారమ్మ
తెచ్చెను మృదు మధుసారమ్మ

బాజా భజం త్రీలంత
పందిరిలో చేరారంత.
పెద్దల చిన్నలతో గూడి,
పందిరి కలకల లాడింది.
కోడి పుంజులొక్కుమ్మడి కొక్కురు
కో, యని కాకా లూదినవి.

కప్పల గాంగులు 'బెకాబెకా'
డప్పుల చప్పుడు చేసినవి.

భోగము నెమలిది వచ్చింది.
భరత నాట్యమును చేసింది.
కొమ్మలలో కోకిల జంట
కమ్మని గానము చేసింది.

బడాయి హంసలు పెండ్లిపెత్తనము
హడావిడిగ సాగించినవి.
గోరువంకలూ శుకములు మంగళ
హారతులెన్నో పాడినవి.

గన్నేరు పూవులు తెచ్చిన తేనెలు
కట్నంగా చదివించారు.
పూతపూచినా మామిడి, తుమ్మెద
జాతికి విందులు చేసింది—

ఒకపువ్వు మెడపై వరుడూ, యిం
కొక పువ్వుపై వధువును చేరి,
ముసి ముసి నగవులతో వారు
వసంత మాడగ సాగారు.

పుప్పొడి గులాము పెండ్లముపై
పెండ్లి కొమారుడు చల్లాడు.
పెండ్లము సిగ్గున తలవంచి
పెనిమిటిపై తాజల్లంగ,

క్రిందే పడిపోయిందంత.
అందరు పకపకమని రంత.
పెండ్లి కుమారుండే గెలిచె
పెండ్లి కొమారిత యోడింది—

తుమ్మెద దంపతులిటు తమ తమ
హృద
యమ్ముల దాచిన సమ్మదము
పుప్పొడివలె యొక రింకొకళ్ళపై
గుప్పుచు వసంత మాడంగన్

ప్రేక్షకు లెల్లరు సంతోషముతో
పొంగి బొర్లబడి పోయారు.
గమ్మత్తులతో, వేడుకగా
తుమ్మెద పెండ్లయి పోయింది.



# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

## 12

మా పడవలో సామాను ఎక్కువ అవటం మూలాన పడవ చాలా నెమ్మదిగా కదులుతోంది. రాత్రి ఒంటిగంట అయేసరికి మా ద్వీపం అవతలి కొనమాత్రం దాటగలిగాము. మమ్మల్ని తరుముతూ మరి ఏ పడవా రానందుకు చాల సంతోషించాము. ఎవరన్నా వస్తే ఎలా తప్పించుకునే వాళ్లమో మాకే తెలియదు.

జిమ్ కోసం జాక్సన్ ద్వీపానికి వెళ్ళిన మనుషులు నేను చేసిన నెగడు చూసి వుంటారు, అక్కడికి జిమ్ మళ్లీ వస్తాడని అక్కడే రాత్రంతా దాక్కుని వుంటారు. అందుచేత మాకు తెల్లవారేలోగా ఎవరి అపాయమూ ఉండదని అనుకున్నాము.

తెల్లవారే సూచనలు తోచగానే ఇల్లినాయిస్ రాష్ట్రం తీరాన ఒక మలుపులో పడవను దాచి కట్టివేశాము. ఇల్లినాయిస్ రాష్ట్రతీరాన అన్నీ దట్టమైన అడవులు, మిస్సోరీ రాష్ట్రం తీరాన ఎత్తైన కొండలు ఉన్నాయి. నది ఎగువకుగాని, దిగువకుగాని ప్రయాణం చేసే పడవలు మిస్సోరీ రాష్ట్రతీరం వెంబడే పోతాయి, లేక నదిమధ్యగా పోతాయిగాని మా తీరానికి రావు. అందుచేత మే మెవరికీ దొరికే అవకాశం లేదు. ఒడ్డున చెట్లమధ్య కూర్చుని నదిలో తిరిగే పడవలను, పొగ లాంచీలను చూస్తున్నాము. నేను కిందటి రాత్రి సెంట్ పీటర్స్ బర్గ్‌లో కొత్తావిడ దగ్గిరినించి లాగిన సమాచార మంతా జిమ్‌తో చెప్పాను. ఆవిడ చాలా తెలివితేటలున్న మనిషేనని జిమ్ అన్నాడు. ఆమె ధోరణిచూస్తే జాక్సన్ ద్వీపంలో నెగడు వద్ద కూర్చుని తనకోసం ఎదురుచూసే మనిషిలాగా లేదనీ, మంచి వేటకుక్క నొకదాన్ని వెంట బెట్టుకుని వచ్చి ద్వీపమంతా వెతికిస్తుందని కూడా జిమ్ అన్నాడు. వేటకుక్కను వెంటబెట్టుకుని పొమ్మని భర్తతో చెప్పి వుంటుందనీ, భర్త వేటకుక్క కోసం మళ్ళీ ఊళ్లోకి వెళ్ళి వుంటాడనీ, అందుచేత మన వెంట తరమటానికి ఆలస్యమై వుంటుందనీ జిమ్ ఊహించి చెప్పాడు జిమ్ చెప్పింది నిజమనే నాకూ అనిపించింది ఏ కారణం వల్ల ఆలస్యమైతే నేమి, మాకు అపాయం రానంతవరకూ దాన్ని గూర్చి ఆలోచించ దలుచుకోలేదు నేను.

చీకటి పడవస్తోంది. పడవ సరంబీమీద జిమ్ చక్కని డేరా తయారు చేశాడు. డేరాలోపల అయిదారు అంగుళాల మందాన మట్టిపోశాము. దానిమీద మంట చేయడానికి వీలుగా వుంది పడవ అంచుకు ఒక కర్ర కట్టి దానికి లాంతరు వేళ్లాడగట్టాము. లాంతరు వెలిగించి ఉంచటం అవసరం. ఎందుకంటే నదిలో తిరిగే పడవలు చీకట్లో మా పడవకు ఢీకొట్టుకో వచ్చును.

అది మా రెండో రాత్రి ప్రయాణం. ఏడెనిమిది గంటలసేపు ఆగకుండా ప్రయాణం చేశాము నది గంటకు సుమారు నాలుగుమైళ్ల వేగంతో ప్రవహిస్తోంది. మధ్య మధ్య చేపలు పట్టడం, వెల్లకిలా

పడుకుని నక్షత్రాలకేసి చూస్తూ కబుర్లు చెప్పుకోవడం, నిద్ర ఆపుకో లేనప్పుడు బట్టలు విప్పేసి పడవ వెంబడే నదిలో ఈదటం—ఈవిధంగా కాలం గడిపాము ఆరాత్రి, ఆమర్నాటి రాత్రి, ఆమర్నాటి రాత్రి ఇలాగే ప్రయాణం సాగించాము. ఏవిధమైన అడ్డంకి కలగలేదు.

ప్రతిరాత్రి మేము కొన్ని పట్టణాలను దాటిపోయేవాళ్లం. దూరంనుండి కనిపించే దీపాలనుబట్టి పట్నాలనుకునే వాళ్లం. గాని, ఎప్పుడూ ఎక్కడా ఆగలేదు. అయిదో రోజు రాత్రి సెంట్‌లూయీ పట్నం మీదుగా పోయాం. అక్కడ ఎన్ని దీపాలు కనబడ్డాయో చెప్పలేను. పట్నమంతా దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. మావూళ్లో వాళ్లు సెంట్ లూయీని గూర్చి గొప్పగా చెప్పుకునే వాళ్లు ఇరవై, ముప్ఫయ్ వేలమంది జనం వున్నారట సెంట్ లూయీలో. సెంట్ లూయీని ఆరాత్రి కళ్లతో చూసేదాకా అంతమంది జనం వుంటారని నేను నమ్మలేదు.

ప్రతి రాత్రీ ఏదో పల్లెటూరు వద్ద ఆగే వాళ్లం. జిమ్‌ను పడవలోనే వుంచి నేను ఊళ్లోకి వెళ్లేవాణ్ణి. పదిపదిహేను సెంట్లు పెట్టి మాకుభోజనానికి అవసరమైన పదార్థాలన్నీ కొనుక్కు వచ్చేవాణ్ణి. ఎదురుగా ఎప్పుడైనా కోడిపిల్లలు కనిపిస్తే నోరునొక్కి జేబులో దాచుకుని వచ్చేవాణ్ణి. మానాన్న చెప్పేవాడు: అవకాశం దొరికితే కోడిపిల్లలను దొంగిలించు. నీకక్కర్లేకపోతే మరెవరికైనా అక్కర కొస్తాయి మానాన్న ఈసూత్రం ప్రకారం నడుచుకునేవాడు. కాని దొంగిలించిన కోడిపిల్లలు వాడికి పనికి రాకుండా ఎప్పుడూ పోలేదు.

తెల్లవారు ఝాముల్లో నేను ఒడ్డుకు సమీపంలో ఉన్న తోటల్లోకి జొరబడి పుచ్చకాయలు, దోసకాయలు, గుమ్మడికాయలు ఎవరూ చూడకుండా "అరువుగా" తీసుకువచ్చేవాణ్ణి. "అరువు" తీసుకు రావటంలో తప్పేమీ లేదని మానాన్న చెప్పేవాడు. కాని డగ్లస్ అమ్మగారు "అరువు" అని పేరు పెట్టినంత మాత్రాన దొంగతనం దొంగతనం కాకుండా పోదని అనేది. ఈరెండు మాటల్లోను కొంత కొంత నిజం ఉందని జిమ్ అన్నాడు. ఒకరోజు రాత్రి నేనూ జిమ్ ఆరుబైట పడవలో కూర్చుని ఈ విషయం చాలాసేపు చర్చించాము. "అరువు" తెచ్చిన వాటిలో కొన్ని నీటిలో పారవేస్తే పాపం చుట్టుకోదని జిమ్ అన్నాడు. ఉన్నవాటిలో వేటిని పారవెయ్యటమా అని ఆలోచించాము. చివరికి బొత్తిగా వగరుగా, తింటానికి వీల్లేకుండావున్న ఉసిరికాయలు పారెయ్యటానికి నిశ్చయించాము. అప్పటికి మా మనస్సులు కుదటపడ్డాయి.

సెంట్‌లూయీ పట్నం దాటిన తర్వాత అయిదోనాటి రాత్రి గొప్ప వర్షం కురిసింది. ఒకటే ఉరుములు, మెరుపులు. మేము డేరాలోనే కూర్చున్నాము. పడవ ఎటుపోతే అటు పోనిచ్చాము. మెరుపు మెరిసినప్పుడల్లా విశాలమైన నదీ దృశ్యం కనిపించేది. కొంతదూరం అల్లా పోయాక హఠాత్తుగా ఒకచోట ఒక పెద్ద పొగబోటు,నదిమధ్యలో కొండ రాళ్ళకు తగిలి ఆగిపోయి కనిపించింది. మేము మాపడవను దానికేసి తిప్పాము. మెరుపు మెరిసినప్పుడల్లా పొగబోటు, బోటుమీద గది స్పష్టంగా కనిపిస్తున్నాయి. బోటు సగం వరకూ బురదలో కూరుకుపోయింది. బోటులో కెక్కి సమాచారమంతా పరిశీలించాలని కుతూహలం కలిగింది. కాని జిమ్ ఒప్పుకోలేదు:

"నేను ఛస్తే రానండి. మన కక్కర్లేని వాటి జోలి కెందుకు వెళ్లటం? ఆబోటుమీద ఎవడన్నా కాపలా వాడుంటే?"

"కాపలావాడా? నీకు పిచ్చా జిమ్? బోటు బురదలో కూరుకుపోయి ఇంత బ్రహ్మాండంగా వర్షం దంచుతుంటే కాపలా కాస్తూ కూచ్చుంటాడా ఎవడన్నా? పైగా బోటుగదిలో "అరువు" తెచ్చుకోటానికేమన్నా దొరకవచ్చు కూడాను. చుట్టలు తప్పకుండా దొరుకుతాయని నా నమ్మకం. బోటు కెప్టెన్లు తాగేచుట్టలు ఒక్కొక్కటి అయిదేసి సెంట్లు ఖరీదుంటుంది. ఈ కెప్టెన్లున్నారే వాళ్లకి నెలకి అరవై డాలర్ల జీతమిస్తారు. వాళ్లు ఏదన్నా కొనాలని బుద్ధిపుడితే ఎంత ఖర్చవుతుందని ఆలోచించరు ఏది కావాలంటే అది ఎంత డబ్బయినా పోసికొనడమే. నాకు తెలుసు వాళ్ల సంగతి. నీజేబులో ఒక కొవ్వొత్తిదాచు జిమ్. ఆబోటును కొల్లగొడితే గాని నాకు తోచేటట్టు లేదు. టామ్‌సాయర్ ఇప్పుడుంటే ఊరుకునేవాడనా

నీ ఉద్దేశ్యం? ఏదో సాహసం ఎప్పుడూ చేస్తూ ఉండనిదే అతనికి నిద్రపట్టదు. ఆబోటుమీదికి అతి జాగ్రత్తగా, ధైర్యంగా వెళ్లేవాడు. క్రిస్టఫర్ కొలంబస్ అదేదో దూర దేశానికి ప్రయాణం చేసినంత గొప్పగా గర్వంగా ఆబోటును ముట్టడించేవాడు. టామ్‌సాయర్ నిజంగా బలే గొప్పవాడులే. ఇప్పుడతని క్కడుంటే ఎంత బావుంటుంది!

జిమ్ ఇంకొంచెం గొణిగాడు గాని చివరకు ఒప్పుకున్నాడు. బోటుదగ్గిరికి వెళ్లిన తర్వాత నోరెత్తి మాట్లాడ గూడదన్నాడు.

వీలైనంత నిశ్శబ్దంగా బోటును సమీపించాము. బోటు సరంబీ మీదికి ఎక్కి పాకుకుంటూ కెప్టెన్ గది కేసి పోయాము. గదితలుపు తెరిచేవుంది. లాంతరు కూడా వెలుగుతూ వుంది. హఠాత్తుగా కొన్ని గొంతుకలు వినిపించాయి. జిమ్ హడిలిపోయాడు. పారిపోదామన్నాడు. సరేనని వెనక్కి తిరిగాను. ఒక గొంతుక బిగ్గరగా వినిపించింది.

"మీకు దణ్ణం పెడతాను. వద్దురా. ఎవరితోనూ చెప్పనని ప్రమాణం చేస్తున్నాను."

"మేం నమ్మం. ప్రతిసారీ ఎక్కువ వాటా కోసం దెబ్బలాడటం, ఇవ్వకపోతే ఫిర్యాదు చేస్తానని బెదిరించటం — ఇది నీకు అలవాటైంది. నీ అంత నీచుడు, మోసగాడు ఈదేశంలో లేడు," అని ఇంకో గొంతుక అంటున్నది.

అప్పటికే జిమ్ సరంబీదిగి మా పడవలోకి చేరాడు. నేను ఉన్నచోట నించి కదలలేదు. టామ్ సాయర్ ఉంటే అతడు మాత్రం కదిలేవాడా? ఊహూ. నేను మాత్రం ఎందుకు పారిపోవాలి? అనుకుని గది పక్కగాఉన్న కిటికీ సందుల్లోంచి తొంగి చూశాను. ఒక మనిషి వెల్లకిలా పడుకుని ఉన్నాడు. కాళ్లు, చేతులు కట్టి వేయబడి ఉన్నాయి. ఇద్దరు మనుషులు వాడిమీదికి వంగి ఉన్నారు. ఒకడి చేతులో ఒక గుడ్డి లాంతరు, ఇంకోడి చేతులో పిస్టలు ఉన్నాయి. ఉండి ఉండి పిస్టల్‌మనిషి పిస్టల్‌ను నేలమీది మనిషి గుండెలకు గురిచూపిస్తున్నాడు. గురి చూసినప్పుడల్లా బంధితుడు గొల్లున ఏడుస్తూ "అరే బిల్! కాస్తాగరా. నే నెవ్వరితోనూ చెప్పనురా," అని ప్రార్థిస్తున్నాడు.

అలా వాడు ప్రార్థించి నప్పుడల్లా లాంతరు పుచ్చుకున్న మనిషి వికటంగా నవ్వి,

"అవును ఎవరితోనూ చెప్పవు. ఎల్లా చెబుతావూ? నువ్వు రేపటిదాకా బతికివుంటే గద. బతిమాలు తున్నాడు చూడు. మనం ఎల్లాగో కింద మీదపడి కట్టేశాం గాని లేకపోతే ఈపాటికి మనిద్దరినీ ఘోరంగా చంపేసేవాడు. ఏమిటీ మనం చేసినతప్పు? మనం వాడికేం అన్యాయం చేశాం? ఏముంది, ఏమీ లేదు. బిల్, పిస్టల్ తీసెయ్యరా."

బిల్ అన్నాడు: "నేను తీసెయ్యను, జేక్! వాణ్ణి చంపేస్తాను. వాడు ముసలాడు హాట్‌ఫీల్డ్‌ని చంపలా? అలాగే వీణ్ణి మనం చంపేద్దాం.

"కాని చంపటం అనవసరం నాకిష్టం లేదు."

"ఎందుకని?"

"ఎందుకేమిటి? నాకారణాలు నాకున్నాయి. నీయిష్ట మేమిటి?"

బంధితుడు "జేక్! నన్ను రక్షించరా. చచ్చేదాకా నీ కుక్కనై వుంటాను," అని ఏడవటం సాగించాడు.

జేక్ ఆఏడుపు వినిపించుకోకుండా లేచాడు. లాంతరు ఒకమేకుకు తగిలించాడు. బిల్‌ను తనతో రమ్మన్నాడు. ఇద్దరూ గదిబయటికి వచ్చారు. నేను కిటికీకి ఆనుకుని నుంచున్నాను. నరంబీమీద కటిక చీకటిగా వుంది జేక్, బిల్ ఇద్దరూ నేనున్న చోటికే వచ్చి గోడ నానుకుని నుంచున్నారు నేను చెయ్యి జాచితే తగిలేట్టున్నారు కొంచెం అవతలకు కదులుదామంటే, పట్టుబడి పోతానేమోనని భయం. ఎందుకొచ్చానా అని విచారిస్తూ ఊపిరి బిగపట్టి నుంచున్నాను. వాళ్లిద్దరినుంచీ విస్కీవాసన ఘాటుగా కొడుతోంది· ఇద్దరూ నెమ్మదిగా మాట లారంభించారు. బిల్ ఇలా అన్నాడు.

"మొదట్లో మనం బతిమాలినకొద్దీ బిర్రబిగిశాడు. పోలీసులతో చేప్పేస్తానని బెదిరించాడు. ఇప్పుడు కాళ్ళబేరానికొచ్చినా రేపు చెప్పెయ్యడని నమ్మకమేమిటి? పోనీ మనిద్దరి వాటాలుకూడా వాడికే యిచ్చేస్తామనుకో. అప్పుడుమాత్రం చెప్పడని ఏముంది? వాణ్ణికాళ్లుచేతులు కట్టేసి ఇంతసేపు ఏడిపించినతర్వాత ఈ కసితీర్చుకోకుండా ఉంటాడా? అందుకని ఏమైతే అదయింది; వాణ్ణి చంపేద్దామని నా అభిప్రాయం."

"అవును, నా అభిప్రాయంకూడా అదే," అన్నాడు జేక్.

"మరి ఇందాకటినుంచీ వద్దన్నావేం? పద, పోయి ఆ కాస్తాకానిచ్చేద్దాం."

"ఆగు, నే చెప్పేదంతా చెప్పనీ. పిస్టల్ పేల్చి చంపటం తేలికే. కాని అంతకంటే తేలిక పద్ధతిఉంటే పిస్టల్ పేల్చటమెందుకు?"

"ఏమిటా తేలికపద్ధతి?"

"నే చెప్పేదేమిటంటే, మనవాటాసొమ్ము, వస్తువులు అన్నీ మూటకట్టి డింగీలోవేసుకుని ఒడ్డుకి పోదాం. ఒడ్డునకాచుకూర్చుందాం. ఈ పోగబోటు బద్దలై మునిగిపోవటానికి రెండుగంటలకంటె ఎక్కువ పట్టదు. అంతసేపూ వేచివుంటే జిమ్‌టర్నర్ మన సహాయంలేకుండా వాడంతటవాడే బుడుంగుమంటాడు. వాడు చచ్చిపోయినందుకు మనకి పాపమూ చుట్టుకోదు, నేరమూ రాదు. ఏమంటావ్, నేను చెప్పింది బావుందా?"

"బాగానేవుంది. కాని ఈ బోటు నువ్వు చెప్పినట్టు మునిగిపోకపోతే?"

"చూద్దాంగా, మునుగుతుందో, లేదో? మునక్కపోతే అప్పుడాలోచిద్దాం ఏంచెయ్యాలో."

"సరేపద"

ఇద్దరూ మళ్ళీ గదిలోకివెళ్లారు ఇదేసమయమని నేను మా పడవను కట్టివేసినవైపుపోయి "జిమ్!" అని మెల్లిగా పిలిచాను. జిమ్ "ఊ" అని మూలిగాడు.

"పోవాలి, పదపద. ఈ బోటులో హంతకులున్నారు. వాళ్ల చేతులో చిక్కామంటే చచ్చామన్నమాటే. ఇక్కడెక్కడో వాళ్ళ డింగీవుందిట. దాని తాడుకోసేసి వదిలేద్దాం. మనం మనపడవలో పారిపోదాం. వాళ్ళని ఈ బోటుమీదే వదిలేసిపోవాలి ఒడ్డుకి రానివ్వకూడదు నేను డింగీకోసం అటు వెదుకుతాను. నువ్విక్కడ వెదుకు"

"హక్‌గారూ! మనపడవలేదు తాడు తెంచుకుని ఎటోపోయింది," అన్నాడు జిమ్ బలహీనంగా.

13

ఆమాట చెవులోపడగానే పచ్చాననుకు

న్నాను. కాని విచారించటానికికూడా టైములేదు. వాళ్ళ డింగీని వెదికి పట్టుకోవాలి. దాంట్లో మేమే పారిపోవాలి. మరోఉపాయంలేదు. ఇద్దరంకలిసి బోటు అంచులవెంబడేదిగి డింగీని వెదకసాము. ఆ అయిదు నిమిషాలు అయిదువారా లన్నట్లనిపించింది. చివరికి డింగీ దొరికింది. మా సంతోషం చెప్పనలవికాదు. ఒక్క సెకండులో డింగీలోకి దిగేవాళ్ళమే నేనూ, జిమ్. కాని అదేసమయంలో బోటుగదితలుపు తెరుచుకుంది బిల్, జేక్ బయటికొచ్చారు. జేక్ ఒక మూటని దేన్నో తీసుకొచ్చి డింగీలో పడేశాడు. తను కూడా దిగి దాంట్లోకూర్చున్నాడు తరవాత బిల్ కూడా దిగి కూర్చున్నాడు. జేక్ అన్నాడు:

"బిల్! అంతా రెడీగా ఉన్నట్టేగా. పద పోదాం."

"అన్నట్టు జేక్! జిమ్‌టర్నర్‌గాడి జేబులు మర్చిపోయాం నువ్వు వెదికావా?"

"ఉహు లేదు. నువ్వు వెదికావా?"

"మళ్ళీ వెడదాంపద. వాడి వాటాడబ్బు వాడి జేబుల్లో నేవుంది. వృథాగా వాడితోపాటు అదికూడా నాశనం కావటమెందుకు?"

ఇద్దరూ డింగీలోంచి లేచి మళ్ళీ బోటుఎక్కారు. వాళ్లు గదిలోకిమారటంచూసి నేను డింగీలోకి దిగాను. నా వెంట జిమ్‌కూడా దిగాడు వెంటనే డింగీని బోటుకు కట్టివుంచిన తాడును చాకుతోకోసివేశాను డింగీ ప్రవాహవేగానికి వడిగా కదిలిపోసాగింది. తెడ్లువేస్తే చప్పుడవుతుందని కిక్కురుమనక కూర్చున్నాం. ఒకటి రెండునిమిషాల్లో డింగీ రెండుమూడువందల గజాలు దాటివచ్చేసింది. ఇక భయంలేదనుకుని గట్టిగా రొమ్మునిండా ఊపిరిపీల్చుకున్నాము. ఇంతలో బోటులోనుండి లాంతరు వెలుగుకనబడింది. హంతకులు తమ డింగీ కనిపించక ఆదుర్దాపడుతున్నారని అనుకున్నాము.

తరవాత జిమ్ తెడ్లువేశాడు. డింగీ చురుకుగా ప్రయాణించసాగింది. నాకు నెమ్మదిగా హృదయం బరువెక్కటం ప్రారంభమైంది. వాళ్లు ఎంతహంతకులైనా తోటిమనుషులేకదా. వాళ్ళనావిధంగా దుర్మరణానికి వదిలివేసివచ్చినందుకు నా మనస్సు ఎంతైనా ఖేదపడసాగింది. ఇంకకొద్దిసేపట్లో బోటు ఎలాగూ మునిగిపోతుంది. ఈలోగానే వాళ్ళని రక్షించే ఉపాయంచూడాలి. అందుకని జిమ్‌తోఅన్నాను:

"ఒడ్డునెక్కడన్నా వెలుగుకనిపిస్తే నేను అక్కడికిపోతాను. ఎవరన్నా మనుషులు కనిపిస్తే వాళ్లతో ఏవో కల్లబొల్లిమాటలుచెప్పి వాళ్లని బోటువద్దకు పంపిస్తాను. బోటులో హంతకులనుచూసి ఏం చెయ్యాలో వాళ్ళేచూసుకుంటారు. ఈలోగా నువ్వు కొంతదూరంలో డింగీతోసహా దాక్కునివుండు. బోటువద్దకు మనుషులు వెళ్ళగానే నేనువచ్చి నిన్నుకలుసుకుంటాను. అప్పుడు మనం ముందుకు సాగిపోవచ్చు."

జిమ్ సరేనన్నాడు. కాని నా ఆలోచన భగ్నమైంది. మళ్లీ పెద్దపెట్టున వర్షంప్రారంభమై, ఇందాకటికంటె ఎక్కువగా కురవసాగింది. అలాగే వానలో తడుస్తూ తప్పించుకుపోయిన మా పడవకోసం ఆ చీకట్లోనే అన్వేషిస్తూ, ముందుకుపోయాము. వెదకగా వెదకగా చాలసేపటికి ఒక మెరుపు మెరిసినప్పుడు దూరాన ఏదో నల్లగా కనిపించింది దగ్గిరికి వెడితే అదే మా పడవ. మాపడవమాకు దొరికినందుకు సంతోషించాము డింగీలో హంతకులుపడేసిన మూట వున్నది. అది తీసి మా పడవలోచేర్చాము. ఇంతలో ఒడ్డున ఒకలైటు కనిపించింది. అక్కడెవరో మనుషులుంటారనీ, నేనుపోయి ఫాగబోటువిషయం ఫైసలు చేసివస్తానని జిమ్‌తోచెప్పి డింగీ తీసుకుని బయల్దేరాను. జిమ్‌ను పడవలో కొంతదూరం ముందుకుసాగిపొమ్మనీ, సుమారు రెండుమైళ్లుపోయాక లాంతరు వెలిగించి చూపించమనీ, అప్పుడు నేను డింగీవేసుకునివచ్చి కలుసుకుంటాననీ చెప్పాను.

లైటు కనిపించేవైపు బయల్దేరాను. ఒడ్డుసమీపిస్తున్నకొద్దీ మూడు, నాలుగు, ఇంకా ఎక్కువలైట్లు కనిపించాయి అదొకచిన్నగ్రామం. ఒడ్డుచేరగానే దగ్గర్లో కనిపించేలైటువద్దకు వెళ్లాను. ప్రయాణీకులను నదిదాటించే తెప్పమీద ఆ లైటు వెలుగుతున్నది

తెప్పమీద కాపలామనిషి నిద్రపోతున్నాడు. ఆ మనిషిని రెండుసార్లుగుంజి, అతడు లేచేసమయానికి వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాను.

(ఇంకావుంది)

# యుక్తిలెక్క

అవి నేను చదువుకొనే రోజులు. మాతో "పద్మ" అనే ఓ అమ్మాయి ధర్డుఫారం చదువుతుండేది. ఆమె చాలా తెలివైన పిల్ల. లెక్కలలో మరీ తెలివిగా

రచన:
## జి. శ్రీదేవి

వుండేది. ఎప్పుడూ ఏవో యుక్తి లెక్కలు యింటిదగ్గర ఏ పెద్దవాళ్ల దగ్గరో నేర్చుకొని, అవి బడిలో పిల్లలమీద ఉపయోగించి, వాళ్లను పద్మ ఎల్లప్పుడూ ఓడిస్తూ వుండేది. మా బడిలో పద్మని "యుక్తి లెక్కల పద్మ" అని కూడా మారుపేరుతో పిలిచేవాళ్లం.

మాతో "లలిత" అనే మరో అమ్మాయి చదువుతూ వుండేది. ఆమె చాలా చలాకీపిల్ల. మంచి ఉపాయంగలది. మా మేస్టరమ్మల్ని సహితం, అప్పుడప్పుడు అంటే వాళ్లు కోపంగా వున్నప్పుడు ఏదో ఒకవిధంగా వాళ్లను నవ్వించి, వాళ్ల కోపాన్ని మళ్ళించేది.

పద్మ ఒకదినం, లలిత మీద ఓ యుక్తి లెక్క యీ విధంగా విసిరింది. "ఒక పట్టణంలో ఒక పెద్ద మేడఉంది. ఆ మేడకి ముప్పై అంతస్తులు, అంతస్తుకి ముప్ఫై గదులు, గదికి ముప్పై దూలాలు, దూలానికి ముప్పై ఉట్టెలు, ఉట్టెకు ముప్పై చట్టెలు చట్టెకు ముప్పై అట్లులు. ఐతే మొత్తం అట్లు ఎన్నో చెప్పకుంటావా, లేక ఓడి పోతావా? నీకు చేతనైతే నామీద ఒక ప్రశ్న వేసి నన్ను ఓడించు చూదాం!" అన్నది.

లలితకు చాలా గట్టిచిక్కే వచ్చింది పాపం. పద్మముందర ఓడిపోవడంకంటే వేరే చిన్నతనం లేదనుకుంది. అయితే లలిత చాలా ఉపాయవంతురాలని ముందే చెప్పానుగా! వెంటనే బుర్ర ఉపయోగించి, పద్మమీద యీ విధంగా ఓ యుక్తి లెక్క వేసింది. "ఒక వూరిలో




నటరాజు—ఒక గీతతో బొమ్మ.

చిత్రకారుడు: శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ.

ఒక రాజుండే వాడు. అతనికి పది మంది భార్యలు. ఆ భార్యలకు పదేసి మంది కొడుకులు, ఆ కొడుకులకు పదేసిమంది భార్యలు, ఆ భార్యలకు పదేసిమంది కొడుకులు, ఆ కొడుకులకు పదేసి మంది భార్యలు, ఆభార్యలకు పదేసిమంది కొడుకులు, ఆ కొడుకులకు పదేసి మంది భార్యలు, ఆభా.......... ఆ కొడు ...ఆభా...ఆకొ... "ఈ విధంగా పదేసిమంది భార్యలూ, పదేసిమంది కొడుకులతోనే మా మూడో పీరియడైన, తెనుగు క్లాసు జరిగి పోయింది ఆఖరికి గంట కొట్టే శారు. "రేపు తక్కిన లెక్క చెప్తా" నంటూ లలిత, అందరితో పాటూ ఆసాయంకాలం యింటికి వెళ్లి పోయింది.

ఆమరునాడు స్కూలుకు వెళ్లాం లలిత సరాసరిగా పద్మకు ప్రక్కగానే వచ్చి కూర్చుంది. ఆముందు రోజు తాలూకు లెక్క విన్న మాలో కొందరం కూడా, పద్మా, లలితలకు దగ్గరగానే కూచున్నాం కుతూహలంగా. ఇంగ్లీషు క్లాసు జరుగుతోంది. నెమ్మదిగా మొదలు పెట్టింది లలిత పద్మతో మళ్ళీ యథా ప్రకారంగా "ఆ భార్యలకు పదేసి మందికొడుకులు, ఆ కొడుకులకు పదేసిమంది భార్యలు, ఆభా.. ఆకొ..."అంటూ. పాఠం వినడం లేదన్న సంగతి అమ్మగారికి తెలిసిపోతుందే, మోనన్న భయం పట్టుకుంది పద్మకి, విసుగు చూపించినా లలిత మాత్రం విడవటం లేదు, "ఆభా..ఆకొ..." అంటూనే వుంది. నెమ్మదిగా. ఆఖరుకి పద్మకి విసుగెత్తి "చాల్లే పిల్లా! అమ్మగారు వింటే దెబ్బ లాడతారు. తీరికగా మరో రోజు చెప్పొచ్చులే నీ అంతు లేని లెఖ" అంది. "పరవాలేదు పద్మా! నెమదిగా చెప్తా "నంటూ మళ్ళీ గొణుగుతూనే వుంది. "ఆ భార్య .ఆ కొడుకులు.. "అంటూ కొంటె లలిత ఇక పద్మ భరించ లేక, అమ్మగారి నడిగి పైకి వెళ్ళి, మళ్ళీ రెండో పీరియడు మొదలు పెట్టేవరకూ రాలేదు పాపం! కొళాయి దగ్గరకు నుదురు చన్నీళ్లతో బాగా కడుక్కొంటే వుంటుంది పద్మ తలనెప్పి తగ్గడానికి.

రెండో పీరియడు మొదలయింది వచ్చి కూర్చుంది పద్మ విసుగ్గా. తయారు లలిత. "ఆభా ఆకొడుకు.. అంటూ నెమ్మదిగా. పద్మకు భరించలేని కోపంవచ్చి "తల్లీ నీ లెక్క కోదణ్ణం! నీకో దణ్ణం!! ఇకనైనా ఊరుకో, మంచిలెక్కల క్లాసు వృధాగా పాడౌతోంది" అన్నది. లలితకు విసుకూ విరామం లేదు. సిగ్గంటే అసలే లేదు. ఇకనైనా ఉరుకోవాలా! వుహూ. ఊరుకోలేదు. మళ్లీ ప్రారంభించింది, "ఆభా... ఆకొ..." అంటూ. పద్మ పుస్తకాలు గట్టిగా ఒల్లమీద కొట్టి "ఛీ! నోరుముయ్!" అని గట్టిగా అరిచింది కోపం ఆపుకోలేక. మా మేష్టరమ్మగారు విన్నారు. తననే ఎవరో నోరుముయ్యి మన్నారనుకుందేమో అనవసరంగా పాపం "ఎవరది" అని అడిగింది మా మేస్టరమ్మ. ఎవరూ మాట్లాడలేదు. క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. "ఆ అరచినదెవరు? సంగతేమిటో చెప్తారా లేకుంటే క్లాసందర్నీ బెంచీలమీద నిలబెట్టమంటారా?" అని గర్జించింది మా ముక్కోపి యైన లెక్కల మాస్టరమ్మ.

ఆఖరుకి సంగతి బైట పడింది. వెంటనే అమ్మగారు పేక బెత్తంతో వాళ్ల దగ్గర ప్రత్యక్షమై "ఇన్ని అట్లు" అంటూ పద్మనీ, "ఇందరు భార్యలూ, ఇందరు కొడుకులూ" అంటూ లలితనీ, ఫడా, ఫడా, మని ఇద్దరికీ వడ్డించారు.

అక్కడితో పాపం పద్మ యుక్తిలెక్కలు ఎవ్వరినీ అడగడమే మానింది. కొంటిలలిత మాత్రం, అప్పుడప్పుడు, పద్మనుచూచి నెమ్మదిగా "ఆభార్యలకు పదేసి మంది కొడుకులూ, ఆకొడుకులకు పదేసి మంది భార్యలూ" అంటూనే వుండేది. పద్మ వినిపించనట్లు నటిస్తూ, చరచరా వెళ్ళిపోతూ వుండేది. ★

# అలవా[illegible]బాటు

శ్రీమతి
లంక అమృతాంబ

రాఫీ డేరా ఇస్మాయిల్ అని అరబ్ దేశంలో ఒక చిన్న నగరం ఉంది. అందులో చాలా వింత వస్తువులు తయారు చేయబడేవి. దానికి ఒక వజీరు అధిపతి. ఆయన చాలా తెలివైనవాడని, బుద్ధిశాలులని కూడా చులాగ్గా బోల్తా కొట్టిస్తాడని ప్రతీతి-అటువంటివాడిని బోల్తా కొట్టించడము కష్టమే-పొరబాటు చేయించడము కష్టమె-ఈవిషయం వజీరుకు గూడ తెలును. అందువల్ల ఆయనకు అహంభావం చాలా ఎక్కువ గూడా.

దీనికి తగినట్లుగా ఆయన ఒక రోజున చాటింపించారు - "నాచేత పొరబాటు చేయించినవారికి పెద్ద బహుమాన మిస్తానని" ఇది చుట్టుపక్కల గ్రామాలలోగూడా విరివిగా ప్రచురణ మైంది-ఎందరో మేధావులు యధాశక్తి ఆయనదగ్గరికివచ్చి ప్రయత్నించారు. చులాగ్గా వారందరిని ఓడించి వజీరు పంపేశాడు. ఇంతమంది రావడం, వారితో ప్రసంగించి వారిని ఓడించడంతో వజీరు అలసిపోయాడు. ఆరోజే ఆఖరి రోజని మరునాటినుండి ఎవ్వరు తనతో ఈ ప్రయత్నములో ప్రసంగించడానికి వీలులేదని చాటింపించాడు. ప్రజలలో ఒక్కరికిగూడ వజీరుచేత పొరబాటు చేయించడంలో నమ్మకం లేదు-ఎవరికి వారే యీ విధంగా ఉద్దేశ్యపడడంతో ఒక్కరూ వజీరుదగ్గరకి రాప్రయత్నించడం లేదు

ఆరోజు ఆ వూరిలో పెద్ద సంబరం-దాంట్లో వింత వింత వస్తువులు అన్నీ అమర్చబడి ఉన్నాయి. విపరీతమైన జన సమ్మర్దంగల ఆ ప్రదేశానికి వజీరు విశ్రాంతికొరకు వచ్చాడు. ఎటు చూచినా వింత వస్తువులే. వాటిని చూచి ఆనందించాడు. అక్కడ కొందరు మనుషులుగూడా వింతగా ఉన్నారు. వారిలో ఆడవారు, మగవారు అను విచక్షణ కష్టంగా తోచింది వజీరుకు. ఈఆలోచనలో ఉన్న వజీరు ముందునుంచి ఒక అందమైన మనిషి మెల్లగా నడిచిపోయింది.

వజీరు ఆ అందాల రాశినిచూచి ఆశ్చర్యచకితుడైనాడు. కాని దుస్తులన్ని పురుషునివే. ఆ చక్కదనము మాత్రమె స్త్రీది-ఆవేశపూరితుడైన ఆ వజీరు తన ప్రక్కనున్న మనిషితో మెల్లగా "ఆ పోతున్న మనిషి, బాలుడో, బాలికో చెప్పగలరా?" అని అన్నాడు. దానికి సమాధానం వచ్చింది "దేవర చిత్తగించాలి, ఆ పిల్ల నా కూతురు" వెంటనే తత్తరపాటుతో ఆమనిషివంక చూచాడు వజీరు-

"చాలా పొరబడ్డాను. మీరామె తండ్రని తెలిసి గనక ఉంటే నేను అడగకపోయే ఉందును" అని అన్నాడు వజీరు-ఆమనిషిముఖంలో చిరునవ్వు బయటపడింది - "ప్రభు



వులకు మా మానవి-తమరు చిత్త గిస్తేనే నామె తల్లిని" అని చెప్పింది. వజీరుకు ముచ్చెమటలు పోశాయి- "ఎంత పొరబాటు! తన ప్రక్కనున్నామెను చూసి పురుషు డను కొన్నాడే తనకు తెలియకపోతే ఊరుకునే ఉండేవాడు. అది చాలా బాగుండేది. కాని యిప్పుడో ఛా! ఛా!" అని తనని తాను నిందించుకున్నాడు.

ఆమెకు బహుమానం యిద్దామని చూచేటప్పటికి ఆమె దూరాన నడచిపోతూ కన్పించింది - వెంటనే తన సేవకులని పంపి ఆమెను, ఆమె కుమార్తెను పిలిచి, తనచే పొరబాటు చేయించినవారికి గాను ఏర్పరుపబడిన బహుమతికి మించి యిచ్చి, ఆనందింపచేసి పంపాడు.



# ★ కారల్ మార్క్స ★

కారల్ మార్క్స అనే ఆయన 1818 వ సంవత్సరంలో జర్మనీలో జన్మించాడు. ఈ రోజుల్లో ప్రతి దేశంలోను కమ్యూనిస్టులు ప్రబలి పోతున్నారని నువ్వు వినే వుంటావు. ఈ కమ్యూనిస్టులకు కారల్ మార్క్సమూలపురుషుడు. ఈయన కమ్యూనిజమ్ అనే ఒక సిద్ధాంతాన్ని లేవదీసి దాన్ని ప్రచారం చెయ్యటానికి బోలెడు పుస్తకాలు రాశాడు. ఆ సిద్ధాంతాన్ని అమలులోకి తీసుకు రావాలనే వాళ్లనే కమ్యూనిస్టు లంటారు.

కారల్ మార్క్స తల్లిదండ్రులు యూదు జాతీయులు. తండ్రి లాయరు వృత్తి చేసేవాడు. మార్క్సకు ఆరేళ్ల వయస్సప్పుడు కుటుంబమంతా క్రైస్తవమతం పుచ్చుకుంది. కాని ఈమతం మార్పువల్ల మార్క్సలో మార్పేమీ రాలేదు. అతనికి మొదటినుంచీ దేవుడుమీద నమ్మకంలేదు. పద్దెనిమిదోఏట జెన్నీ అనే అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయిమీద కట్టలు కట్టలు ప్రేమగీతాలు రాసి కొన్నిటిని పత్రికల్లో ప్రకటించాడు. దీంతో కారల్ మార్క్సకు మొదట కవిగా పేరు వచ్చింది. 23 వ ఏట బెర్లిన్ విశ్వవిద్యాలయంలో వేదాంత శాస్త్రంలో డాక్టర్ డిగ్రీ పుచ్చుకున్నాడు. అప్పటి నుంచీ విడవకుండా పత్రికలకు వ్యాసాలురాసి ప్రకటించేవాడు. ఆకాలపు జర్మనీ ప్రభుత్వం మీద, సంఘ పరిస్థితులమీద, మతంమీద వేదాంతంమీద ఘాటైన విమర్శలు రాసేవాడు. ప్రభుత్వానికి కోపం వచ్చి మార్క్సను దేశంనుండి వెళ్లగొట్టింది. ఫ్రాన్సు పారిపోయాడు. ఫ్రెంచి ప్రభుత్వంకూడా వెళ్లగొట్టింది. బెల్జియం దేశానికి పారిపోయాడు: ఇలా దేశాలన్నీ తిరుగుతూ ఆఖరికి ఇంగ్లండు దేశం వచ్చి లండన్ నగరంలో స్థిరపడ్డాడు. ఈలోగానే తను ప్రేమించిన జెన్నీని పెళ్లి చేసుకున్నాడు. లండన్‌లోనే 1883 మార్చి 14 న చనిపోయాడు.



కారల్ మార్క్స జీవితాంతం వరకూ బీదతనంతో బాధపడ్డాడు. ఏదన్నా ఉద్యోగమో, వ్యాపారమో చేస్తే డబ్బు పుడుతుంది. కాని చెయ్యటానికి తీరికేదీ? లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలో ఒక గొప్ప లైబ్రరీ వుంది. రోజూ ఆ లైబ్రరీకి పోయేవాడు. పొద్దుటి నుంచి సాయంత్రం దాకా అక్కడ కూర్చుని చరిత్ర, సైన్సు, సాహిత్యం, ఆర్థిక శాస్త్రం, రాజనీతి శాస్త్రం మొదలైన వాటిమీద వందలకొద్దీపుస్తకాలు చదివేవాడు. చదివినవి మర్చిపోకుండా నోట్సు రాసుకునే వాడు. సాయంత్రం చీకటి పడగానే నోట్సు బుక్కులు చంకన పెట్టుకుని ఇంటికి వచ్చేవాడు. వాకిట్లో పెళ్లాం, పిల్లలు నవ్వు ముఖాలతో స్వాగత మిచ్చేవారు. వారిని చూడగానే మార్క్స కొత్తమనిషి అయిపోయే వాడు. తింటానికేమైనా వుంటే వెంటనే

భోజనం చేసేవారు. లేకపోతే తాకట్టు పెట్టడానికి ఏ వెండి పళ్లెమో పుచ్చుకుని బజారుకి పోయేవాడు. తాకట్టుకి ఏ వస్తువూ లేకపోతే పెళ్లాం చేబదుళ్ల కోసం పొరుగిళ్లకు బయల్దేరేది. చేబదుళ్లు కూడా పుట్టకపోతే ఆ రాత్రికి పస్తు పడుకునే వారు. పెళ్లాం, పిల్లల దిగులు పోగొట్టడానికి మార్క్సు ఛలోక్తులాడి నవ్వించేవాడు. లేకపోతే వాళ్లతో చదరంగం ఆడే వాడు.

మార్క్సుకు ఎంగెల్సు అని మరొక జర్మన్ దేశస్థుడు ప్రాణ స్నేహితుడుగా ఉండే వాడు. ఎంగెల్సుకు ఇంగ్లండులో వ్యాపారం వుంది. అతడు ధనవంతుడు. మార్క్సు ఇబ్బందుల్లో పడినప్పుడల్లా డబ్బు సహాయం చేసేవాడు. మార్క్సుకు నోరు తెరిచి అడగటానికి అభిమానం. అందుచేత అతని అవసరం కనిపెట్టి ఎంగెల్సే డబ్బిచ్చేవాడు. ఎంగెల్సు గనక లేకపోతే మార్క్సు జీవితమంతా చదువులోను, రాతలోను గడపటానికి వీలే వుండేది కాదు.

ఎంగెల్సు మార్క్సుకు ధనమే కాకుండా ఇంకా అనేక విధాల సహాయం చేసేవాడు. ఎంగెల్సు కూడా మార్క్సు లాగానే విద్వాంసుడు. గొప్ప వేదాంతి. వీరిద్దరూ కలిసి కమ్యూనిజం అనే ఒక సిద్ధాంతాన్ని ప్రపంచ చరిత్రలోకి ప్రవేశ పెట్టారు. ఈ సిద్ధాంతాన్ని అమలులోకి తీసుకు రావటానికి యూరప్‌లోని వివిధ దేశాల్లో సంఘాలు స్థాపించి పనిచేశారు. ఇప్పుడు కమ్యూనిస్టు దేశాలు అని చెప్పుకునేవి రష్యా, పోలెండు, హంగరీ, జెకోస్లోవాకియా, రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా, చైనా దేశాలు. ఈ దేశాల్లో ప్రభుత్వాలు తాము మార్క్సు సిద్ధాంతాల నాధారంగా చేసుకుని ఎక్కువ తక్కువలు లేని, బీదవాళ్లు భాగ్యవంతులు అనే తేడాలేని కొత్త సమాజాన్ని నిర్మిస్తున్నామని చెప్పుకుంటున్నాయి.

మనుష్యుల్లో బీదవాళ్లు, భాగ్యవంతులు అనే తేడాలు ఉండటం వల్లనే మానవజాతి అధోగతిలో ఉందనీ, ఈ తేడాలు పోవాలనీ మార్క్సు బోధించాడు. మనిషికి స్వంత ఆస్తి అనేది ఉండకూడదనీ, దేశంలోని సంపదమీద యావన్మంది ప్రజలకు సమాన అధికారం ఉండాలనీ, సమానంగా అనుభవించాలనీ, ఏ ఒక్కడికీ అన్యాయం జరగకూడదనీ ఈయన సిద్ధాంతం. ఈ మార్పులన్నీ రావటానికి అవసరమైతే హింసతో కూడిన విప్లవమైనా జరిపి తీరాలని మార్క్సు వాదించాడు. ఈ సిద్ధాంతం గాంధీ, బుద్ధుడు, ఏసుక్రీస్తు మొదలైన వారి సిద్ధాంతాలకు వ్యతిరేకం. గాంధీ మొదలైనవారు ప్రతి మనిషీ మంచి వాడయితేనే గాని సంఘం బాగుపడదనీ, ప్రతివాడు ప్రేమ, సత్యం, దయ, ధర్మం మొదలైన సద్గుణాలు ముందు అలవరుచుకోవాలనీ అన్నారు. మార్క్సు ఏ మనిషీ స్వతహాగా చెడ్డవాడు గాని మంచివాడుగాని కాడనీ, సంఘంలోవున్న పరిస్థితుల వల్లనే మంచివాడు గాని చెడ్డవాడు గాని అవుతున్నాడనీ, అందుచేత ఆ పరిస్థితులను బాగుపరిస్తే మనిషికూడా బాగు పడతాడనీ వాదించాడు. ఇదీ గాంధీగారికీ, కమ్యూనిస్టుల గురువు మార్క్సుకీ ఉన్న తేడా.

నీ అన్నయ్య,
ఎన్నార్.

# ★ సైన్సు వింతలు ★

★ భూమిమీద నుండి ఇతర గ్రహాలకు ప్రయాణం చేయటానికి పనికివచ్చే సాధనం కనిపెట్టేందుకు శాస్త్రజ్ఞులు చాల కాలం నుంచీ ప్రయత్నిస్తున్నారు. గ్రహయాత్రకు పనికివచ్చే ఈసాధనాన్ని ఇంగ్లీషులో "రాకెట్" అంటారు. చంద్ర గోళానికి ఎగిరిపోయే "రాకెట్" ఇంకో పదేళ్లలో తయారవుతుందని డా॥ నెబిల్ అని ఒక జర్మన్ శాస్త్రజ్ఞుడు చెప్పాడు ఇక్కణ్ణించి చంద్ర గోళానికి రాకెట్ ప్రయాణం 49 గంటల 38 నిమిషాలు పడుతుందట.

★ఇంగ్లండులోని మాన్ చెస్టర్ విశ్వ విద్యాలయంలో ఒక క్రొత్త రకం "యంత్రపు మెదడు" కని పెట్టారు. ఈమాదిరి మెదడు యంత్రాన్ని ఇంతవరకు కష్టమైన లెక్కలు చెయ్యటానికి ఉపయోగిస్తున్నారు. ఈకొత్త యంత్రం పాటలు పాడుతుందట. అంటే గ్రామఫోను మల్లే రికార్డు సహాయంతో కాదు. కాగితంమీద ఏ పాటకైనా స్వరాలు రాసి ఆ యంత్రంలో పెడితే ఆస్వరాలు చూసుకుని దాన్నిబట్టి మనిషి పాడినట్లే పాడుతుందిట. అంతేకాక ఈయంత్రం తనలో ఏ భాగమైనా చెడిపోతే ఎక్కడ, ఏభాగం, ఎందుకు చెడిపోయిందో గుర్తుపెట్టి యజమానికి చెబుతుందిట

★భూగర్భ శాస్త్రంలో పరిశోధనలు చేసిన ఒక అమెరికన్ శాస్త్రజ్ఞుడు భూమి వయస్సు 300 కోట్ల సంవత్సరాలని ఇటీవల ప్రకటించాడు.

★ భూగోళపు దక్షిణ ధ్రువం వద్ద అంటార్కిటికాఅని ఒక గొప్ప ఖండం వుంది. ఈ భూభాగంలో చాలా మట్టుకు ఎప్పుడూ మంచు పేరుకుని వుంటుంది. అక్కడ ఈమధ్య కొన్ని పరిశోధనలు చెయ్యటానికి వెళ్లిన శాస్త్రజ్ఞులలో ఒకాయన చెప్పాడు: అక్కడ నేల మీద 7450 అడుగుల ఎత్తున మంచు పేరుకుని వుంటుందట.

★ హెలికాప్టర్ అనే రకం విమానం ఉపయోగంలోకి వచ్చి చాలా కాలమైంది. మామూలు విమానాలుకొంతదూరం నేలమీద చక్రాలతో పరిగెత్తిగాని ఆకాశంలోకి లేవలేవు. హెలికాప్టర్ విమానం అలాకాదు. ఉన్నచోటి నించే సరాసరి నిలువుగా గాలిలోకి లేచి పోతుంది. అలాగే నిలువుగా నేలమీదికి దిగుతుంది. ఇప్పుడు అమెరికాలో ఇంకో రకం బుల్లి విమానం కనిపెట్టారట. దీనిపేరు "హాపీకాప్టర్" దీన్ని యుద్ధాల్లో సైనికులు వాడవచ్చునట. ఈయంత్రం బుజాన వేసుకుని తిరగవచ్చు. ఇష్టం వచ్చినప్పుడు "బుంయ్" మని పక్షిలాగా గాలిలోకి ఎగిరి పోవచ్చు. ఈహాపీ కాప్టర్ విమానం బాగా అభివృద్ధియై ప్రజలకు అందు బాటులోకివస్తే ఈ రైళ్లు, కార్లు, ట్రాములు ఇవ్వేవీ అక్కర్లేదన్న మాట. ప్రతివాడూ ఒకటి కొనుక్కుని ఎక్కడి క్కావాలంటే అక్కడికి ఎగిరి పోవచ్చు.

★న్యూయార్కులో ఒక శాస్త్రజ్ఞుడు ఒక కొత్తరకం చాకు కనిపెట్టాడు. ఈచాకు ఒక ఎలక్ట్రిక్ చక్రానికి అమర్చబడి వుంటుంది. ఆచక్రం నిమిషానికి 65 వేల చుట్లు తిరుగుతుంది. అలాగ తిరిగి దాని కమర్చబడిన చాకును సెకండుకు 1200 సార్లు పైకీ కిందకీ ఆడిస్తుంది. ఇందువలన కొయ్య వస్తువులను గాని, లోహ వస్తువులను గాని కంటికే కాకుండా, దుర్భిణి (మైక్రోస్కోప్) యంత్రానికి కూడా కనిపించనంత చిన్న ముక్కలుగా కోస్తుందట ఒక అంగుళాన్ని ఇరవై లక్షల భాగాలుచేస్తే ఒక్కొక్కటి ఎంత వుంటుందో అంత చిన్నవిగా ఉంటాయిట ఆముక్కలు. వెంట్రుకలో వెయ్యోవంతు అని కూడా చెప్పవచ్చుట. ఎలక్ట్రాన్ దుర్భిణీ యంత్రానికి గాని ఆముక్కలు కనిపించవట. ఆజ్ బెస్టాస్, కార్కు, ఎముకలు, లోహాలు, కొయ్య, ప్లాస్టిక్ మొదలైన వాటిని అవలీలగా, చప్పుడు లేకుండా, శబ్ద వేగాన్ని మించిన వేగంతో కోస్తుందట ఈచాకు. ★

## క్రొత్తమాష్టారు

(18-వ పేజీ తరువాయి)

ఆటోగ్రాఫులకు అందరిదగ్గరా పేపర్లు తీసుకొన్నారు. అందులో ఒకకాగితంమీద

బి. గోపాలం.
ఐదవఫారం,
ప్రభుత్వపాఠశాల,
సూర్యనారాయణపురం,
విజయవాడ,
విజయవాడతాలూకా,
కృష్ణాజిల్లా,
చెన్నరాష్ట్రం,
హిందూదేశం,
ప్రపంచం.

అనివున్న చిరునామాపేపర్ని చూచి కొద్దిగా నవ్వుకొని ఆ కాగితం చేతితో పట్టుకొని 'ఎవరీ బి. గోపాలం' అని అడిగారు. వెనక బెంచీమీదనున్న గోపాలం లేచి 'నేనేనండీ' అన్నాడు.

"ఇటురావోయ్! ఒకసారి"

గోపాలం మాష్టారి కుర్చీదగ్గరకువెళ్లాడు. గోపాలం తనకాగితంమీద యేమివ్రాశాడో తెలిసిన తదితర విద్యార్థులంతా యేమిజరుగుతుందో అని ఆత్రంతో చూస్తున్నారు. అదీకాకుండా క్లాసుకంతటికీ గోపాలమే నాయకుడు. ఇప్పుడు క్లాసు జయాపజయాలంతా అతని ఒక్కడిమీదే ఆధారపడి వున్నాయి. అతడు మాష్టారికి యేదోవిధంగా సమాధానంచెప్పి ఆయనవ్వుంచి మాటేమీ పొందకుండావుంటే ఫరవాలేదు. విజయం తమదే. అట్లాకాకుండా గోపాలం కనక మాటపడ్డాడా ఇక మాష్టారిదేవిజయం. ఆయన తమ తరగతినంతా లోబరచుకున్నట్టే. అందువల్లవారిద్దరి సంభాషణా విధానాన్ని జాగ్రత్తగా వినాలని-సూది పడితే వినపడేటంత-నిశ్శబ్దంగా వున్నారు అంతాకూడా.

"ఈపేరు నీదేకదూ!"

"అవునండీ"

"ఏదీ దానిమీద నువ్వువ్రాసిన పేరూ, అదీ చదువు ఒక్కసారి, అందరూ వింటారు."

" .. .... . "

"చదవవోయ్! నువ్వు వ్రాసింది నువ్వు చదవటానికేం?" సరే, గోపాలం చదివాడు.

"నీ వెవరబ్బాయివోయ్"

"డాక్టరు రామారావుగారబ్బాయినండీ"

"అదేమిటోయ్!! అట్లా చెప్పావు?"

" ... "

"మీ అమ్మగారి పేరేమిటి?"

"రమణమ్మగారు"

"మీ అమ్మమ్మగారి, తాతగారి, ముత్తాతగారి...మొదలైన మీ పూర్వీకుల ఇంచుమించు మీ చివరి యే మూడుతరాల వారి పేర్లు చెప్పుకుంటూ వచ్చి చివరకు వారివారి పుత్రుడనని చెప్పుకోవాలిగాని, ఒక్కసారిగా డాక్టరు రామారావుగారబ్బాయినంటే చాలుతుందటోయ్?"

"అదేమిటండీ? మీరు మా తల్లిదండ్రుల విషయం తేవటం భావ్యం కాదు" అన్నాడు గోపాలం కొద్దిగా చిన్నబుచ్చుకున్న ముఖంతో.

"అవునవును" "మాష్టారు మాట్లాడిందంతా విత్‌డ్రా చేసుకోవాలి" అని వెనక నుంచి అరుపులు బయలుదేరాయి. అప్పటికే గంటకూడా కొట్టడమైంది. మాష్టారు కుర్చీలోంచి లేచి నిలబడ్డారు, పిల్లలుకూడా లేచి గుసగుసలాడుతున్నారు. అప్పుడు "ఫుష్! ... ఇటుచూడం డొకమాట!

నేను మాట్లాడిన విషయంలోని ఒక్క మాటనుకూడా విత్‌డ్రా చేసుకోవలసిన అవసరం నాకేమీ కనపడటంలేదు. విత్‌డ్రా చేసుకోనుకూడా. మీరంతా బాగా ఆలోచించుకొని, ఏదోఒకటి నిశ్చయించుకొని నా వద్దకువచ్చి మాట్లాడండి. అని చకచకా వెళ్లిపోయారు మాష్టారు.

"అటెండెన్సు వేసేటప్పుడూ అంతే. ఇప్పుడు ఆయన అన్నమాటల్ని విత్‌డ్రా చేసుకొమ్మన్నప్పుడూ అంతే...ఇంత మందిమి కలిసి గోలచేసినా అంత మొండిగా జవాబు చెప్పాడే!! కరోడా లాగానే వున్నాడురా" అని వాళ్లల్లో వాళ్లే నిశ్చయించుకొని ఎవరికివారే వారివారి మనసుల్లో క్రొత్తమాష్టార్ని తమ క్లాసులో బరచుకోలేదనే నిర్ణయానికి వచ్చేశారు.

"ఏరా! గోపాలం మన పప్పులు క్రొత్త మాష్టారి దగ్గరేమీ వుడికేటట్టు కనపడటం లేదే" అన్నాడు కొద్దిగా నిజాయితీగల శేఖరం.

"ఆ! అయినా క్రొత్తమాష్టారు చాలా మంచివారురా మంచి సమర్థులు కూడా" అన్నాడు గోపాలం లేని వుత్సాహం తెచ్చుకొని.

"అవునులే, కాకపోతే అసమర్థుడికి మన క్లాసు లొంగిందంటే మనకే కదురాపరువు తక్కువ కాబట్టి తప్పనిసరిగా అట్లాగే చెప్పుకోవాలిలే ఏమంటావ్"

" . . "

★

# వారం వర్జ్యం

(17-వ పేజీ తరువాయి)

రెండు టిక్కెట్లకు ఇంటరుక్లాసుకి చేరే ఫ్యాను రాసియిచ్చాడు. అప్పటికా గండం గడిచి బయట పడ్డామని సంతోషించాడు గోపీ.

ఇంతలో రైలు వచ్చింది. జనం కిటకిటలాడుతున్నారు. పెట్టెలో సామానుతోను, శ్రీమతితోను ఇంటరు క్లాసులో ఎక్కేటప్పటికి నానా అవస్థ అయింది తను తొడుక్కొన్న క్రొత్తప్యాంటు కాస్తా, ఆ ఒత్తిడిలో బాగా నలిగిపోయింది ఎలాగయితేనేం ఒక చిన్న ఇంటరు కంపార్టుమెంటులో ఎక్కారు. ఆ కంపార్టుమెంటులో పదిమంది పైన ఉన్నారు జనం తన ట్రంకు పెట్టె సీట్లమధ్య ఖాళీజాగాలో పెట్టి దాని మీద భార్యను కూర్చోబెట్టాడు, ఒక ట్రంకు పెట్టె ఒక బెడ్డింగు, ఒక పెద్ద మరచెంబు గోపీ సామానులు. ఇక్కడ మరచెంబును గురించి కొద్దిగా చెప్పాలి. అది మంచి కంచుతో చేయబడ్డది. మూడు శేర్ల నీరు పట్టేటంత పెద్దది గోపీ అత్తవారు యిరవై రూపాయల ఖర్చుతో కొన్నారు. కంచు తెల్లగా, నిగనిగా మెరుస్తున్నది చూపరుల దృష్టిని తేలికగా ఆకర్షిస్తుంది. క్రొత్త నమూనా ననుసరించి చేయబడింది గోపీ భార్య జానకి తన ప్రయాణంలో తోడుగా వుంటుందని తెచ్చుకొంది

గోపీకి కూర్చోనేందుకు చోటు లేదు. రైలు ప్రక్క స్టేషను చేరేదాకా నిలువు కాళ్ళ మీద ఉన్నాడు. ప్రక్క స్టేషనులో ఇద్దరు ప్రయాణీకులు దిగారు. వారి చోట్లో కూలబడ్డాడు. గోపీ ప్రక్కనే ఒక సూటు వాలా కూర్చొన్నాడు. అతని ఆకారం చూస్తే టాప్‌టిప్‌గా ఉండి చదువుకొన్న వాడిలాగా, పెద్దమనిషిలాగా కనబడ్డాడు. గోపీ, జానకి పెట్టెలో ఎక్కినప్పటినుంచీ, ఆ పెద్దమనిషి దృష్టి మరచెంబుమీదే ఉంది. అడపాతడపా మరచెంబువంక తనచూపులు పోనిస్తున్నాడు.

గోపీ ఆ పెద్దమనిషి చూపులను గమనించలేదు. తన ధోరణిలో తనువున్నాడు. బండి తన వూళ్లో బయలుదేరటమే ఆరు గంటలకు బయలుదేరింది. తన వూరు అయిదు గంటలు ప్రయాణం చేస్తేగాని రాదు. అంటే యింటికి చేరేటప్పటికిరే పన్నెండు గంటలో అవుతుంది. అదీ ఈ మధ్య యేమీ అవాంతరం కలగకపోతే.

ప్రయాణీకులు ఎవరి పనులలో వారున్నారు. చిన్న చిన్న స్టేషనులలో రైలు ఆగుతూ, పోతూ ఉన్నది.

ఇందాక చెప్పిన పెద్దమనిషి గోపీతో మధ్య మధ్య మాట్లాడుతూ కొద్దికొద్దిగా పరిచయం చేసుకున్నాడు. ఊరూ, పేరూ, వృత్తీ, అన్నీ కనుక్కొన్నాడు.

చినగంజాం కొచ్చాలు వచ్చింది. అక్కడ రైలు ఇంజను నీరు పోసుకోటానికి వాటర్ టాంకు దగ్గరికి పోయింది. గోపీ కూర్చున్న పెట్టె రైలు చివరది.

గోపీ తన భావనా ప్రపంచములో నుంచి ఒక్కసారిగా ఉలిక్కి పడి మామూలు ప్రపంచములోకి వచ్చాడు. దానికి కారణం గోపీకి ప్రక్కనున్న పెద్దమనిషి.

"ఏమండి, కొత్త మీ మరచెంబు ఇస్తారూ, ఇంజను దగ్గరకెళ్లి వేడినీళ్లు పంక కొస్తాను'' అని వినయంగా గోపీపట్టు చూసి అడిగాడు.

చెప్పటం మరిచాను మరచెంబు ఉన్నది గోపీ భార్య జానకి కూర్చొన్న పెట్టెమీద ఆమె ఇప్పుడే తలుపు తీసుకొని లెట్రినులోకి వెళ్లింది

"అలాగేనండి'' అని గోపీ మరచెంబు మూత తీయబోయినాడు మూతతీసి ఉత్త మరచెంబు ఇద్దామని. "ఎందుకండీ మూత తీయటం? ఇప్పుడు తీసుకురానా? మూతతోగూడా ఇలాఇవ్వండి''అన్నాడు.

గోపీ మూత పెట్టి మరచెంబు పెద్దమనిషి చేతి కందిచ్చాడు గోపీలో *humanity* చచ్చిపోలేదింకా అందుకే, మరచెంబు అడగగానే చేతి కందిచ్చాడు.

అయినా ఇప్పుడే నీళ్లు తీసుకొచ్చుకొని ఇస్తానంటే ఎవరు మాత్రం ఇవ్వకుండా ఎలా ఉంటారు? అందులో అవతల అడిగే మనిషి సూటు బూటు వేసుకొని పెద్దమనిషిలాగున్నాడు.

పెద్దమనిషి మరచెంబు తీసుకొని ఇంజను వేపు చరచరా నడిచిపోయినాడు. గోపీ ఉన్న పెట్టెకు ఇంజనుకు మధ్య చాలా దూరముంది.

అయిదు నిమిషాలు గడిచినయి జానకి లెట్రిను తలుపు తీసుకొని తన స్థానానికి చేరుకొంది మరచెంబు లేదు భర్తనడిగింది మరచెంబు ఏంచేశారని తన ప్రక్కనున్న ఆయన వేడినీళ్లు తెచ్చుకోటానికి ఇంజను దగ్గరకు తీసుకొని వెళ్లాడని చెప్పాడు. ఆమె అప్పుడే అనుమానించింది

పది నిమిషాలయింది. ఇంజను నీరుపోసుకొని వచ్చింది రైలు కదలడానికి గార్డు విజిలు వేశాడు. పెద్దమనిషి అయిపులేడు. గోపీ ఇంజనువేపు చూసాడు ఎవ్వరూ కనపడలేదు మరచెంబు పట్టుకొని. ఇంతలో రైలు కదలనే కదిలింది.

గోపీకి ఆశ్చర్యం వేసింది. మరచెంబు తీసుకొని వెళ్లిన పెద్దమనిషి యేడీ? రైలుకదిలినా ఇంకా పెట్టెలోకి రాకుండా యేం చేస్తున్నాడు? అసలు యే పెట్టెలోనన్నా యెక్కాడా లేదా?

కొద్దిగా అనుమానం తగిలింది మరచెంబుతో పెద్దమనిషి పలాయనం చిత్తగించాడేమోనని.

ప్రక్క ప్రయాణీకులను ప్రశ్నించాడు పెద్దమనిషి సామానులు పెట్టెలో ఏమన్నా వున్నయ్యా అని. ఎవరూ జవాబు చెప్పలేక పోయినారు ఆయన తాలూకు సామానులేమైనా పెట్టెలో ఉన్నయ్యని. ఎవరి

ఇవాల వార చూసుకుంటే అదీ తేలిపోయింది. పెద్దమనిషి కట్టుబట్టలతో పెట్టెలో కక్కాడని.

ప్రక్క స్టేషను వచ్చింది కాని పెద్దమనిషి రాలేదు. రైలు దిగి ఎక్కడని వెతకటం? అసలు నిద్రపోలులోనే పలాయనం చేశాడేమో?

ఒక్కొక్కటే ఆలోచించుకొంటుంటే గోపీకి అర్థమయింది పెద్దమనిషి చూపులలో వున్న అంతరార్థం. అందుకోసమే కాబోలు తనతో పరిచయం చేసుకొన్నాడు. జానకి లెట్రినులోకి వెళ్ళగానే, ఆ అవకాశాన్ని ఏలా సద్వినియోగం చేసుకొన్నాడో ఇప్పుడర్థమయింది గోపీకి. జానకి వుంటే చూస్తూ మరచెంబు పరాయివాడికి అప్పగించి ఊరుకుంటుందా? అందుకే కాబోలు ఆమె లేకుండా చూసి అడిగాడు.

తనయినా మరచెంబు వేడినీళ్లు తేవటాని కనగానే, వేడినీళ్లెందుకో, ఎవరికో అడగకుండా యివ్వటం తన బుద్ధి తక్కువ గాదూ? కట్టుగుడ్డలతో రైలులో ఎక్కిన వాడికి వేడినీళ్లెందుకు మరచెంబుకోసం కాబోలే?

రైలులో పట్టపగలు అంతమంది జనంలో తను మోసపోవటం, తను బయలుదేరిన వేళా విశేషమేమోనని గోపీకి తట్టి అనుమానం తగిలింది.

అందుకుతోడు తన భార్య జానకి ఎత్తిపొడుపులతో పెద్దమనిషి క్రుంగిపోయినాడు.

"నే చెప్తే విన్నారూ? చక్కగా తిరిగి ఇంటికి పోతే ఇంత అవస్థ వచ్చేవాళ్లం కాదుగా? అవును రెండి వర్జ్యం, వారం మీకు పట్టింపులేదుగా మాకేగాని. అయినా పోయినా మా మరచెంబేగదూ పోయింది" అని జానకి హేళన చేసింది గోపీని.

రైలు తెనాలి చేరేటప్పటికి సరిగా పన్నెండు గంటలయింది. ఒకటే వాన. రైలు దిగి స్టేషనులోకి వెళ్లేటప్పటికే సగం తడిశారిద్దరూ. కూలీ దొరికేటప్పటికి బ్రహ్మ ప్రళయమైంది. ఎలాగో సామాను బయటికి మోయిస్తే, జట్కా వాడు రూపాయిన్నర యిస్తేగాని బండికట్టనన్నాడు. మామూలుగా అర్థ రూపాయతో పోయేదానికి 'బ్రతుకు జీవుడా' అని రూపాయిన్నర అర్పించుకొని ఎలాగయితేనేం గోపీ ఇల్లు చేరాడు.

ఏదో పెద్దవాళ్లు చెప్పారు ఇకనుంచీ వారం, వర్జ్యం చూడకుండా ప్రయాణం చేయకూడదు. అనుకొన్నాడు గోపీ కాని యింటికిచేరిన మరునాడే తన అభిప్రాయం మార్చుకోవాల్సి వచ్చింది తన కుటుంబ పురోహితుని దగ్గర కెళ్లి క్రితంరోజు సాయంకాలం మూడు గంటలకు వర్జ్యముందో లేదో ప్రయాణానికి మంచిదవునో కాదో చూడమన్నాడు.

పురోహితుడు సుబ్బావధానిగారి పంచాంగం విప్పి క్రితం రోజు సాయంకాలం మూడు గంటలకు ముహూర్తం ఎలా ఉందో చూసేడు. అతను చెప్పిన విషయం.

"ప్రయాణ ముహూర్తము చాలా దివ్యంగా వుందండి. తిథి చక్కగా వుంది. ప్రయాణాని కనుకూలమయినది. వర్జ్యము మూడు గంటల కసలు లేదు. రాత్రి ఏడు గంటలకు ప్రారంభం. అందుకనే మీరు నిన్న సాయంకాలం మూడు గంటలకు బయలుదేరిన వేళా విశేషం వల్ల నిర్విఘ్నంగా ఇంటికి చేరుకున్నారు."

గోపి ఆశ్చర్యానికంతులేదు. మరి తన మామగారు పంచాంగం చూసి ప్రయాణ ముహూర్తంలో దోషముంది అని చెప్పేరే! మరచెంబు పోవటం తను ప్రయాణంలో నానా అవస్థపడటం ఆ ముహూర్త ప్రభావం అనుకొన్నానే! ఆయన ఎవరి పంచాంగం చూసి చెప్పాడో? మరి ఇప్పుడు తన పురోహితుడు చూసిన పంచాంగ కర్త సుబ్బావధానిగారు ప్రయాణ ముహూర్తం దివ్యంగా ఉందన్నారే? ఏమిటిది?

చివరకు గోపీ "ఇది బయలుదేరిన వేళా విశేషంవల్లగాదు అందరూ ఎప్పుడో ఒకప్పుడు అడపా దడపా ప్రయాణాలలో ఇలాంటి అవస్థలకు గురి కావలసిందేనన్న" నిశ్చయానికి వచ్చాడు.

# సినిమా వార్తలు:



## మహబూబ్ ప్రొడక్షన్స్ 'ఆన్'

హిందీ, తమిళ భాషల్లో మహబూబ్ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్న త్రివర్ణ చిత్రం 'ఆన్' విడుదలకు సిద్ధంగా ఉంది. దీనికి దాదాపు నలభైలక్షల రూపాయలు ఖర్చయిందట. ఇందులో నదీరా అనే కొత్తతార, దిలీప్ కుమార్, నిమ్మీ మొదలైనవారు నటిస్తున్నారు.

* * *

ఇకనుంచి రాజ్ కపూర్ తెలుగులో కూడా చిత్రాలు తీస్తాడని వినికిడి.

* * *

## రోహిణీ పిక్చర్స్

హెచ్. ఎం. రెడ్డిగారు తమ స్వంత స్టుడియోలో "పంజన్స్" అనే చిత్రాన్ని తెలుగు, తమిళ, హిందీభాషల్లో తీస్తున్నారు. ఈ మాసాంతానికి మూడవభాగం పూర్తి కాగలదు.

సాంఘిక చిత్రం ఒకటి తెలుగు, తమిళ భాషల్లో పైవారం ప్రారంభిస్తున్నారు. పైరెండు చిత్రాలలోను కాంతారావు, "రాజనాల" ప్రధానభూమికలు నిర్వహిస్తున్నారు. సాంఘికచిత్రాన్ని శ్రీ హెచ్. వి. బాబుగారు డైరెక్టు చేస్తారు.

## చేతనావారి "దేశద్రిమ్మరి"

చేతనా ప్రొడక్షన్స్‌వారి 'దేశద్రిమ్మరి' రీహార్సల్సు చురుకుగా సాగుతున్నాయి. పైవారం సెట్టుమీదికి వెళ్ళదలచినట్లు తెలుస్తున్నది. శ్రీ శ్రీ, ఆరుద్ర దీనికి సంభాషణలు పాటలు వ్రాస్తున్నారు. పెండ్యాల నాగేశ్వర రావు మ్యూజిక్, డైరెక్షన్ "శ్రీ సారథి"

## రాజ్యం పిక్చర్స్ "దాసి"

రాజ్యం పిక్చర్స్‌వారి తొలి సాంఘిక చిత్రం "దాసి" షూటింగు ఇటీవల శోభనాచల స్టూడియోలో ఏకధాటిగా సాగింది. ఎన్. టి. రామారావు, లక్ష్మీరాజ్యం ప్రధాన పాత్రధారులు. డైరెక్షన్



మహబూబ్ ప్రొడక్షన్స్ త్రివర్ణచిత్రం 'ఆన్'లో కొత్తతార నదీరా.



యువావారి 'టింగ్‌రంగా'లో కనకం, నల్లరామ్మూర్తి.



శుభోదయావారి 'ఆదర్శం'లో జగ్గయ్య, జానకి.



భరణీవారి 'ప్రేమ'లో శకుంతల అంతర్నాటకం.

రంగనాథదాసు, పర్యవేక్షణ ప్రసాద్, కథ, సంభాషణలు సదాశివబ్రహ్మం.

## ఏ. ఎన్. ప్రొడక్షన్స్
## "ఆడబ్రతుకు"

ఆడబ్రతుకు షూటింగు పూర్తిఅయింది. రెండురోజుల్లో రీరికార్డింగు ప్రారంభిసారు. ఈ చిత్రం మార్చి కడపటి వారంలో రిలీజు కావచ్చు. రఘురామయ్య, శ్రీరంజని, కృష్ణకుమారి కనకం ముఖ్య పాత్రలు నిర్వహించారు. డైరెక్షన్ వి. ఏ. సుబ్బారావు. సంగీతం ఓగిరాల రామచంద్రరావు.

* * *

భరణీవారి 'ప్రేమ' మార్చి 21 వ తేదిన ఆంధ్రదేశమంతటా విడుదలకానున్నది.

* * *

రాజేశ్వరి షూటింగు దరిదాపు పూర్తి అయింది. పై మెరుగులు దిద్దుతున్నారు.

పద్మనాభన్ గారు కూడా మార్చి కడ



రాజ్యం పిక్చర్స్ 'దాసి'లో ఒక సన్నివేశం.

పటివారంలో రిలీజు చెయ్యడానికే సంకల్పించారు.

* * *

"టింగ్‌రంగా" షూటింగ్ పూర్తి కావచ్చింది. ఏప్రిల్ మొదటివారంలో రిలీజు కావచ్చును.

టింగురంగా ఆడబ్రతుకు. పూర్తి కావడంతో బి.ఏ. సుబ్బారావుగారు తమ స్వంత చిత్రాలపై దృష్టి కేంద్రీకరిస్తారని తెలుస్తున్నది. పల్లెపడుచు, రాజు-పేదా ఒకేసారి ప్రారంభిస్తారనీ, పల్లెపడుచు దర్శకత్వం చాణక్యరావు నిర్వహిస్తారనీ తెలుస్తున్నది. ★





యం. కె. యం. వారి మరదలుపెళ్లిలో కృష్ణకుమారి, ముక్కామల.



ఏ. యన్. ప్రొడక్షన్స్ 'ఆడబ్రతుకు'లో నల్లరామ్మూర్తి, కనకం, సీతారామయ్య.



అరుణావారి "జై వీరబేతాళ"లో కత్తియుద్ధం చేస్తున్న స్వామి, వెంకటేశ్వరరావు.

## వ్యాఖ్యలు, విమర్శలు

(4-వ పేజీ తరువాయి)

అయ్యాకుశాని మన స్టాక్ మార్కెట్లూ, మనషేర్ మార్కెట్లూ, చవగ్గా సులువుగా లక్షలాది ఋణాలిచ్చే బాంకులూ ఉన్నంత వరకూ భయంలేదనే ధీమాతో మన దేశంలో ధరలుమాత్రం వీసమైనా తగ్గక పోగా అక్కడా అక్కడా ఇంకా (కొద్దిగానే అయినా) పెరుగుతూవచ్చాయి. కాని లంపెక్ న్యూయార్క్ నగరాల్ని కాదని బొంబాయి ఆట్టే కాలం నిలవ లేక పోయింది. ఇతర దేశాల్లో ధరలు తగ్గినందు వల్ల మనదేశంనించి కొనుక్కునే నార, వేరు సెనగనూని, వస్త్రం, పొగాకు మొదలైన సరుకుల ధరలు కూడా తగ్గేవరకు చూద్దామనే అభిప్రాయంతో ఇతరదేశాల వారు ఆట్టే ఆర్డర్లివ్వకుండా తమాయించుకుని చూశారు—ఈధర లెందుకు తగ్గవో చూద్దామని. నారకి బేరాలు రాకపోవడంతో వ్యాపారులు ప్రభుత్వాన్ని వేడుకున్నారు ఎగుమతి పన్ను తగ్గించమని. ప్రభుత్వం సరిగా బడ్జెట్‌ను ప్రకటించే ముందే నారమీద ఎగుమతి పన్ను తగ్గిం



విశాఖపట్నం నౌకానిర్మాణ కేంద్రాన్ని సింధియా కంపెనీవారివద్దనుంచి భారత ప్రభుత్వం ఆధ్వర్యాన స్థాపించబడిన హిందూస్తాన్ షిప్ యార్డ్ లిమిటెడ్ తరఫున ఆర్. యల్. గుప్తాగారు అధీనం చేసుకున్నారు.

చింది. ఇంక నారవ్యాపారానికి భయం లేదనుకున్నారు. ఇలాగే వేరుసెనగ పప్పుకీ, నూనికీ, వస్త్రానికీ కూడా ఎగుమతి పన్నులు తగ్గిస్తారనే ధైర్యంతో వ్యాపారులు ముఖ్యంగా స్పెక్యులేషన్‌దారులు (అంటే ధరల హెచ్చుతగ్గుల్ని బట్టి జూదా లాడుతూ లక్షలూ కోట్లూ చిటికలో ఆర్జించే వ్యాపారులు) కనిపెట్టుకుని కూచున్నారు. బడ్జెట్ పార్లమెంట్‌లో ప్రకటించబడింది. తీరా చూస్తే ఏ తగ్గింపులూ లేవు. ఉండవని కూడా మంత్రిగారన్నారు. దాంతో వ్యాపారులికి పన్ను విరిగినట్లయింది.

అయినా వ్యాపారులు నిలదొక్కుకుని చూసేవారేమో, కాని బాంకులు ఎడ్వాన్సులిచ్చే పద్ధతిని ప్రభుత్వం బిగపట్టి వడ్డీరేట్లు పెంచడంతో వ్యాపారులు చిక్కులో పడిపోయారు.

చాలాకాలం సులువుగా తక్కువ వడ్డీరేట్లకి డబ్బు దొరికే ఏర్పాటు చూస్తూ వచ్చింది ప్రభుత్వం. ఇలా చూసినంత కాలమూ చులాగ్గా చవగ్గా వచ్చిన డబ్బుతో వ్యాపారం సాగిస్తుంటూ సరుకు తొక్కిపెట్టి చిత్తంవచ్చినట్లు ధరలు పెంచడానికి ఆ డబ్బుతోనే స్తోమతు తెచ్చుకుని వ్యాపారులు ప్రజల్ని పిండేశారు. ఇతరదేశాలతో పాటే మనదేశంలో కూడా ప్రభుత్వం ఈ పద్ధతిని 1951 నవంబరులో మార్చేసింది. వడ్డీరేటు పెంచేసి బాంకులు ఎడ్వాన్సు ఇచ్చే పద్ధతికి గట్టిషరతులు హామీలూ తగిలించింది.

ఈ షరతుల మూలంగానే వ్యాపారుల ఆట (జూదం) కట్టింది. వ్యాపారానికి మంచి రద్దీసమయం వచ్చేసరికి హామీలకీ షరతులకీ తట్టుకోలేక ఎడ్వాన్సులు సులువుగా రాక స్వయంగా డబ్బు కక్కవలసి వచ్చేసరికి స్టాక్ ఎక్స్చేంజిలో అమ్మకాలు ఎక్కువైపోయినాయి. కొనేవాళ్లెవరుంటారా అని అమ్మేవాళ్లు వెతుక్కోవలసి వచ్చేసరికి ధరలు తగ్గిపోయాయి.

ఏడాదినించీ మిగతా దేశాల్లో విపత్తు లేకుండా ధరలు కొద్దికొద్దిగా తగ్గుతూవస్తే, మనదేశంలో ఏడాదినించీ కొండెక్కి కూచుని దిగిరానంటూ భీష్మించిన ధరలు ఒక్కసారిగా నిలువత్తునా కూలిపోక తప్పలేదు.

అయితే ఇంత విరుచుకు పడిపోయినా కొరియా యుద్ధానికి ముందున్న ధరల స్థాయివరకే తగ్గాయి కాని అంతకి తగ్గలేదు. కొన్ని అంతకి కూడా తగ్గలేదు. ఇంకా పై అంతస్థుల్లోనే



పార్లమెంట్ సమావేశసమాప్తి సందర్భంలో రిపబ్లిక్ అధ్యక్షులు రాజేంద్రప్రసాద్ విందు చేశారు.



ఢిల్లీలో జరిగిన సోవియట్ లలితకళా ప్రదర్శనం: మౌలానా అజాద్ ప్రారంభోత్సవం జరిపారు.

ఉన్నాయి. కొన్ని కొన్ని మరీ దిగజారిపోయినా లేచి ఒళ్లు దులుపుకొని పైమెట్లెక్కాయి.



ఈ ధరలు తగ్గడం మొట్టమొదట (ఫిబ్రవరి బడ్జెట్ ప్రకటన తరవాత) నూనిగింజలకీ నూనికీ తగిలింది. ఆపాటు వెండిబంగారాలమార్కెట్‌కి తగిలింది. వెండిబంగారాల మార్కెట్‌కి తగిలిందంటే, ఇంకేముంది? కపాలంమీద కొడితే ఒళ్ళంతా ఎముకలు గలగల్లాడిపోయినట్లు అన్ని వస్తువులకీ తగిలింది.

ఇంక ఏమౌతుందోనని వ్యాపారులు ఆదుర్దాతో చూస్తున్నారు. ఏమీ అవదు భయం లేదని ప్రభుత్వం అభిప్రాయంట. అట్టే ప్రమాదం వస్తే ప్రభుత్వం ఆదుకోకపోదు. లేకపోతే వ్యాపారాలు నష్టమై పరిశ్రమలకి దెబ్బ తగిలిపోతుంది. (ప్రభుత్వానికొచ్చే పన్నులు కూడా తగ్గుతాయి) కొరియా యుద్ధానికి పూర్వం ఎలా వుండేవో ధరలు అంతవరకూ తగ్గనిచ్చి ఇంక ఆపైన అట్టే తగ్గకుండానూ, మళ్ళీ పెరక్కుండానూ కట్టుదిట్టం చెయ్యడం ప్రభుత్వానికిప్పుడు వీలైనపనే. బాంకులు అడ్వాన్సులిచ్చే షరతులు కొద్దిగా సడలిస్తే వ్యాపారులు కొంత బయటపడతారు. విదేశవ్యాపారం తగ్గిపోకుండా చూసుకోడానికలాగూ ఎగుమతి పన్నులు నేడో రేపో తగ్గించవలసి వస్తుంది. మొత్తానికి దేశానికి విపత్తులేకుండా చెయ్యొచ్చు—వ్యాపారులు పాతధరల్లో బేరాలు సాగనియ్యడానికి (అంటే లాభాలలో తరుగుకి) ఒప్పుకుంటే సరి.

చిత్రమేమిటంటే, ప్రజలకి కొంత బాగ తగ్గి కొంచెం చవగ్గా వస్తువులు లభించాలంటే వ్యాపారులు పారిశ్రామికులు ప్రభుత్వంతో సహకరిస్తే పోయేది, ఇప్పుడు నష్టానికి గురికావలసివచ్చింది. లక్షలూ కోట్లూ లాభాలు ఆర్జించినప్పుడు అనేకమంది వ్యాపారులు పారిశ్రామికులు సరుకు తొక్కిపెట్టి ధరలు పెంచేసి బ్లాక్ మార్కెట్‌లో అమ్మి లాభాలు తీసుకుని ప్రభుత్వానికివ్వవలసిన రాబడి పన్నుకి ఎగనామం పెట్టారు. ఇప్పుడొచ్చిన నష్టం అప్పుడొచ్చిన లాభాల్లో ఎన్నోవంతు? లాభాలు విపరీతంగా కురిసినప్పుడు కష్టపడి పనిచేసిన కార్మికుల న్యాయమైన పాలివ్వని వ్యాపారులు ఇప్పుడు కొద్ది నష్టం వచ్చేసరికి బాంకు డబ్బు స్తోమతు కావాలంటున్నారు. దేశంలో వస్తువుల ఉత్పత్తి 1950 లో కంటె 1951 లో కొద్దిగా పెరిగినమాట నిజమే కాని అవసరాన్ని, జనాభా పెరుగుదలనీ చూస్తే దాన్ని బొత్తిగా నలుసుకింద లెక్కకట్టాలి. వస్తుసంపదా పెరగలేదు. ప్రజలకు కొనుక్కునే ధరలు తగ్గేసరికి వ్యాపారులు కటకటలాడిపోతున్నారు. ధరల్ని తగ్గనివ్వకపోతే ఇంక ప్రజలబతుకెప్పుడు బాగుపడుతుంది? దీన్నిబట్టే ప్రభుత్వం తమ కర్తవ్యాన్ని నిర్ణయించడం అవసరం. ఎందుచేతనంటే ఇంతవరకూ ప్రభుత్వంతో సహకరించకుండా చిత్తం వచ్చినట్లు ఆటలాడుతున్న వ్యాపారుల్ని అదుపులో పెట్టే అవకాశం వచ్చింది.

ఈ అవకాశాన్ని జారవిడవకుండా వ్యాపార విధానాన్ని ప్రభుత్వం కట్టుదిట్టం చేస్తే ముందు ముందు ప్రజల అవసరాలకనుగుణంగా వ్యాపారాన్ని సక్రమగతిలో నడిపించడానికి వీలవుతుంది.

# మద్రాసు డైరీ

సౌహార్ద రాయబారిణిగా రూజ్వెల్ట్ సతి ఇండియాలో పర్యటిస్తున్నది ఈమె ఈ వారం మద్రాసు రావలసి వున్నదిగాని కారణాంతరాలవల్ల కార్యక్రమం మార్చుకున్నది. ఆసియా దేశాల్లో పరిగణించదగిన శక్తిగా పరిణమించిన ఇండియాను అర్థంచేసుకోటానికి, మన సమస్యలను మన మెలా పరిష్కరించుకుంటున్నామో పరిశీలించటానికి ఎలియనార్ రూజ్వెల్ట్ ఈ పర్యటన చేస్తున్నది. అమెరికా తరఫున అధికారరీత్యా రాకపోయినా ఈమె వెల్లడించే అభిప్రాయాలు అమెరికన్ ప్రభుత్వపు ప్రస్తుత విధానాన్ని చాలవరకు పోలివున్నాయి.

*    *    *

లాయ్ హెండర్సన్ స్థానంలో చెస్టర్ బౌల్స్‌ను రాయబారిగా నియమించటంతో ఇండియా అమెరికాల సంబంధాలలో కొత్త అధ్యాయం ప్రారంభమైందని చెప్పవచ్చు పరస్పరానుమానాలతో చాల కాలం బాధపడిన ఉభయదేశ ప్రభుత్వాలు పరస్పరం అర్థం చేసుకున్నాయి విదేశీ పెట్టుబడిని, ముఖ్యంగా అమెరికన్ పెట్టుబడిదారులను అనుమానంతో చూసిన మన ప్రభుత్వం విదేశీ పెట్టుబడులమీద షరతులను సడలించటం, అమెరికా చేయనున్న ఆర్థిక సహాయాన్ని అంగీకరించదలచటం జరిగింది. నైహ్రూ ప్రభుత్వం కమ్యూనిస్టు



కాశ్మీర్ మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం ఫిబ్రవరి నెలాఖరున ఢిల్లీ వచ్చారు.

రాజ్యాలవైపు మొగ్గుతున్నదని, నెహ్రూ సోషలిస్టు అని అనుమానించిన అమెరికన్ ప్రభుత్వం కూడా నిజం గుర్తించి ఇండియాకు ఆర్థిక సహాయం చేయబూనుకున్నది ఈ మార్పుకు రాయబారి చెస్టర్ బౌల్సు కృషి ముఖ్యకారణమనటంలో అతిశయోక్తి ఏమీ లేదు మిగతా అన్ని దేశాలకు రాజకీయ షరతులు, మిలిటరీ షరతులు తగిలించిగాని ఆర్థికసహాయం చెయ్యని అమెరికా ఇండియా విషయంలో ఈ షరతులను కొంత సడలించటానికి కూడా చెస్టరు బౌల్సే కృషే కారణం.

* * *

ఆసియాలో ఇండియా స్నేహం ఎంత అవశ్యకమో అమెరికా ప్రభుత్వం గుర్తించినంతగా ఇతరులు గుర్తించినట్లు కనబడదు అమెరికాలో అధిక ప్రచారంగల పత్రికలన్నీ ప్రభుత్వవ్యతిరేక పక్షమైన రిపబ్లికనుల చేతుల్లో వున్నాయి. ఈ పత్రికలు ఇండియాపై ఇంకా దుష్ప్రచారం సాగిస్తూనే వున్నాయనటానికి విలియం బులిట్ మొదలైనవారు వ్రాసే వ్రాతలే నిదర్శనం ఇండియాలోని పత్రికల్లో ఎక్కువభాగం అమెరికాపై స్నేహభావం చూపిస్తుండగా అమెరికాలో అందుకు వ్యతిరేకంగా జరగటం విచిత్రంగా ఉంది కాని ఎలియనార్ రూజ్వెల్ట్ చెప్పినట్లు ఇండియాను సరిగా అర్థం చేసుకోవాలనే ఆసక్తి అమెరికన్ ప్రజల్లో ప్రబలుతున్నదనటం సత్యదూరం కాదు.

* * *

సింహళ విశ్వవిద్యాలయపు వైస్ చాన్సెలర్ గా వుంటున్న సర్ ఐవర్ జెన్నింగ్స్ గతవారం మద్రాసులో భారతరాజ్యాంగాన్ని గూర్చి మూడురోజులు వరుసగా మూడు ఉపన్యాసాలిచ్చారు రాజ్యాంగశాస్త్రంలో ప్రవీణుడుగా పరిగణింపబడుతున్న సర్ ఐవర్ మన రాజ్యాంగాన్ని జాగ్రత్తగా పరిశీలించి అది చాలా లోపభూయిష్ఠంగా వుందనే అభిప్రాయానికి వచ్చారు బ్రిటన్, ఆస్ట్రేలియా, కెనడా, అమెరికా మొదలైన ఆంగ్లో శాక్సన్ దేశాల రాజ్యాంగాలే మన రాజ్యాంగంకన్న మెరుగుగా వున్నాయనీ, ముఖ్యంగా బ్రిటిష్ రాజ్యాంగ సాంప్రదాయాలు అన్నిటికల్లా ఉత్తమమైనవనీ, మన రాజ్యాంగం పాశ్చాత్య రాజ్యాంగాలను అనుకరించటంవలన అతుకుల బొంతగా తయారైందనీ ఆయన అభిప్రాయపడ్డారు. ఆయన విమర్శకు రాజ్యాంగ నిర్మాతలలో ఒకరైన అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్ సమాధాన మిచ్చారు గాని అది అసంపూర్తిగానే వుంది. సర్ ఐవర్ విమర్శలో చాలా అంశాలు సహేతుకంగా ఉన్నట్లు కనిపిస్తున్నాయి

ఏ దేశపు రాజ్యాంగమూ ఇంత సుదీర్ఘంగా ఉండగూడదని ఆయన ప్రధాన వాదన. రాజ్యాంగం ముందు తరాలవారికి కూడా ఉపయుక్తమయ్యేలా నుండాలనీ, అలా ఉండాలంటే సాధ్యమైనంత క్లుప్తంగా, సాధారణ సూత్రాలను మాత్రమే నిర్దేశిస్తూ ఉండాలనీ, ప్రత్యేక సందర్భాలనుబట్టి సాధారణ సూత్రాలను నిర్వచించుకుపోవాలనీ ఆయన అన్నారు ప్రాథమిక హక్కులకు చెందిన అధ్యాయంలో కూడా ఆయన లోపాలు చూపించారు సర్ ఐవర్ చేసిన నిశితవిమర్శ రాజ్యాంగశాస్త్ర విద్యార్థులకు కొత్త ఆసక్తిని కలిగిస్తుందనటంలో సందేహం లేదు.



**Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Mad… s**

# ★ నందికొండ ప్రాజెక్టు ★



నందికొండ ప్రాజెక్టు నిర్మాణం కానున్న స్థలపరిసరాలు.



ఏనుగుల సెలయేరు.

Regd No M. 4479

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

రెండవభాగం

అనువాదం:

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము.

**వెల: మూడున్నర రూపాయలు**

అమ్మకమునకు సిద్ధముగానున్నది

---

కాపీలకు:

## ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.